ఈ కంప్యూటర్ ఒక క్షణమునకు ఒక కోటి 68 లక్షల స్టెప్స్‌ను ఆలోచన చేసి బేరీజు వేసుకుంటుంది. అయితే చిత్రం ఏమిటంటే ఇటువంటి కంప్యూటర్‌ను రష్యాకు చెందిన ఓ చదరంగపు నిపుణుడు ఓడగొట్టాడు. చూశారా మనిషి సృష్టించిన ఒక కంప్యూటర్‌కే ఇన్ని తెలివి తేటలు వుంటే మనిషిని సృష్టించిన మహాశక్తికి ఇంకెన్ని తెలివి తేటలు వుండాలి.

ఏ రూపంలో, ఏ దారిలో ఎప్పుడు ఎలా ఎక్కడ ఎవ్వరిచే, ఎవ్వరితో, దేనితో, ఏ సమయంలో, ఏ రకంగా, ఏ ప్రాంతంలో **"విధి"** దెబ్బ తీస్తుందో తెలియదు. విధిని ఎదుర్కోవాలంటే మన దగ్గర ఉన్న ఆయుధాలు ఏమిటి.

ఈ ఆయుధాలలో మొదటిది దైవ ప్రార్థన, రెండవది వాస్తు శాస్త్ర సహాయము, మూడవది జోతిష్య శాస్త్ర సహాయము. నా వరకుగా నా అనుభవమున తెలిసిన విషయాలను మీకు తెలపడమైనది. గృహము యందలి వాస్తును మనం పాటించ గలం. పాటించే అవకాశము వుంది. ఇంట సవరణలు కావించవచ్చు. కానీ ఇంటి బయట వాస్తు విషయంలో మనము నిష్ప్రయోజకులం. **అదే పరిసర వాస్తు అదియే విధి, మన తలరాత. అదే "విధి"** చేతిలోని ఆయుధము. విధిని మనము ఎలా బుజ్జగించాలి.

**విధి మనిషిని ఎలా దెబ్బ తీస్తుంది :-** ఈ విషయంలో నేను చాలా మందితో చర్చ సాగించాను. చివరికి దీని విషయంలో ఒక అవగాహనకు వచ్చాను. విధి తన పని తాను చేస్తుంది. ఏమి అడ్డం పెట్టినా తన పని మాత్రము ఆపకుండా ముందుకు వెళ్తుంది. మరి దీని చేతి నుంచి బయటకు పడే మార్గం లేదా?

ఒక వ్యక్తి పేరు నాగభూషణ. ఈయనకు చెడు దశ మొదలైంది. అయితే వ్యాపారము అద్భుతముగా జరుగుతున్నది. ధనము బాగా కూడబెట్టాడు. ఈయన చెడు దశలో ఈయన అప్పుల పాలు కావాలి. పైగా అవమానాల పాలు కావాలి. అయితే ఈయన తన జాతకాన్ని ముందుగానే చూపించు కోవడము జరిగినది. ఈయన ఊరు బీదర్. వాస్తు శాస్త్ర గొప్పతనాన్ని విని ఒక ప్రముఖ వాస్తు శాస్త్రవేత్తను హైదరాబాద్ నుంచి పిలిపించుకుని స్థలం చూపించి గృహానికి ప్లాన్ వేయించుకొని అద్భుతమైన నిర్మాణము కావించారు. అన్నీ బాగున్నాయి. అంతా బాగుంది. ఇప్పుడు 'విధి'కి ఒక బాధ్యత అప్పజెప్పబడినది. అది ఏమంటే నాగభూషణ అప్పులు పాలై అవమానాలు పొందాలి. 'విధి' ఇతన్ని ఎలా దొరకబుచ్చు కోవాలి. తన బాధ్యత నెరవేర్చడానికి 'విధి' నాగభూషణం ఇంటికి బయలుదేరి వెళ్లింది. అయితే అక్కడ అంతయూ వాస్తు చక్కగా ఇమిడి వున్నది. అతన్ని ఎలా అప్పుల పాలు చేయాలో వెంటనే యోచించింది. అతని ఇంటిలో ఏ దోషమూ లేదు. ఏ చిన్నపాటి దోషము ఉన్ననూ దాన్ని ఆసరా చేసుకొని తన బాధ్యతను నిర్వహించడానికి 'విధి' సిద్ధ పడుతుంది. నాగభూషణానికి జూన్ 1వ తేదీ నుంచే జాతక రీత్యా చాలా చెడ్డ సమయము మొదలైంది. అక్టోబర్ అయిననూ అతని పరిస్థితులు ఏ తొందరా లేదు. ఎంతో బాగుంది. కారణం అతను వుంటున్న గృహము యొక్క వాస్తు పట్టు. అప్పుడు విధి పరిసర వాస్తు ఆయుధాన్ని నాగభూషణ గృహముపై ప్రయోగించినది. నాగభూషణం గృహానికి దక్షిణ వైపున గల గృహము యజమాని తన పాత గృహమును పడగొట్టి కొత్తది కట్టాలని తలచి గృహాన్ని పడగొట్టెను. సమయానికి అతను నిర్ణయించిన సమయము దాటి పోయెను. అతనికి రావలసిన సొమ్ము రాక గృహ నిర్మాణము ఆపి వేసెను. ఇంకేముంది 'విధి'కి తన బాధ్యత నెరవేర్చుకునే అవకాశం బాగా లభించింది. దక్షిణము ఖాళీ స్థలాన్ని ఆసరాగా చేసుకొని నాగభూషణాన్ని అప్పుల పాలు చేయడం ప్రారంభించింది. అంత వరకు నాగభూషణం గారికి ఉధృతంగా జరుగుతున్న వ్యాపారం సరిగా జరుగకపోవడము, వీరి కొట్టు ప్రక్కనే ఇంకొకరు కొట్టు వేసిరి. విపరీతమైన కాంపిటిషన్ పెరిగి లాభాలు ఘోరంగా తగ్గి పోయెను. సమయానికి

గుమాస్త ఒక ముఖ్యమైన విషయంలో మోసం చేసి పెద్ద మొత్తంతో ఉడాయించెను. ఇతను కొన్న షేర్లు అన్నియూ అర్థ శేర్‌లు ఆయెను. అంతా పోయా. భార్య ఆరోగ్యము నాశనమాయె. ఆరోగ్యము నెలబెట్టడం కోసము లక్షలు గుమ్మరించెను. అప్పుల పాలు అయ్యెను. అప్పులు ఉంటే అవమానాలు అవెందుకవే తోడనే వస్తాయి కదా. మానసిక క్షోభ, తీరని వ్యథ.

'విధి' కర్తవ్యం ముగిసింది.

పరిసర వాస్తు 'విధి' చేతిలో ఒక ముఖ్య ఆయుధము. అందుకే భగవంతుని నిర్ణయాన్ని మార్చడం అసాధ్యము. మహా శక్తి కలిగిన 'విధి' చేత నుండి బయట పడే ఉపాయము లేదు అని చెప్పు కోవచ్చును. అయితే మానవ ప్రయత్నంగా ఉన్న ఒకే ఒక ఉపాయము వాస్తు. గృహములోనైతే అత్యంత చక్కగా, జాగ్రత్తగా వాస్తు శాస్త్ర సహాయాన్ని పొంది గృహ నిర్మాణమును కావించుకోగలము. గృహము బయట గల పరిసర వాస్తును ఎలా మార్చుకోగలము.

పరిసర వాస్తు అంటే 'విధి'.

**"విధే"** పరిసర వాస్తు.

భగవంతుని ప్రార్థన ద్వారా 'విధి' యొక్క ఉధృత శక్తిని తగ్గించు కోవచ్చును. ఇంకో ఉపాయము ఏమంటే మన గృహములో మంచి వాస్తును పాటించినచో గృహ వాస్తు బలం కూడా పెరుగుతూ వుండి మనల్ని కాపాడుతూ వుండును.

పరిసర వాస్తులో అత్యంత శక్తి వంతమైనది వీధిపోటు.

మంచి వీధిపోటు గల గృహము లభించడము ఆషామాషీ వ్యవహారం కాదు. ఒకవేళ మీకంటూ ఈశాన్యము వీధిపోటు గల గృహము లభించింది అని అనుకుందాము. దీని అర్థము ఏమంటే చాలా మంచి రోజులు ముందు ముందు మీకు వస్తున్నాయని తెలుసుకోవాలి. చెడు వీధిపోటు గల గృహము మీకు లభించిందంటే చెడ్డ కాలము ముందుందని తెలుసుకొని జాగ్రత్తలు వహించాలి. 'విధి' గురించి తెలుసుకోవడము కూడా ఒకసారి మంచిది కాదనిపిస్తుంది. దాని పనికి అడ్డు తగిలిన వారిని సైతం తొలగించే శక్తి కూడా దానికి కలదు. అందుకేనేమో చాలా మంది వాస్తు శాస్త్రవేత్తల పరిస్థితులు అంత బాగుండవు. మనకు 'విధి' నుంచి బయట పడడానికి తెలిసినది ఒక్క మార్గము మాత్రమే. అదే 'విధి'కి సవాలక్ష మార్గాలు తెలుసు. తన కర్తవ్యాన్ని ముగించడము కోసము 'విధి' తనకు నచ్చిన మార్గాన్ని ఉపయోగించుకొని తన కార్యం తను చేస్తుంది.

పరిసర వాస్తు అను ఈ పుస్తకంలో **"విధి"** యొక్క శక్తి గురించి ఇంకా కొన్ని విషయాలను వివరంగా వ్రాయవలసిన అవసరం ఉండడంతో చర్చను కొనసాగిద్దాము.

బీహారు రాష్ట్రంలో ఓ గొప్ప పారిశ్రామిక వేత్త గలడు. ఇతను పారిశ్రామిక వేత్తనే కాక ఒక గొప్ప ధీమంతుడు. పుట్టుకతోనే ధైర్యాన్ని మింగి పుట్టాడు. ఏ సంఘటనలోనూ, ఏ విషయంలోనూ ఇతను భయపడింది లేదు. ధైర్యమే కాక ఇతనికి తెలివి తేటలు కూడా జాస్తీ.

తన పని జరగడం కోసమై ఎంత ఖర్చుకైననూ వెనుకాడరు. ఏదైనా పట్టుబట్టాడంటే ఆ పని జరిగి తీరాల్సిందే. ఒకానొక దినం ఈయన ఫ్యాక్టరీని పరిశీలించు నిమిత్తం ఓ ప్రభుత్వ అధికారి తనిఖీ చేయు నిమిత్తం వచ్చెను. ఒక పొరపాటు దొరికినది. ఆ విషయమై తనిఖీ చేయు అధికారి కేసు పెట్ట ప్రయత్నించెను. ఈ విషయాన్ని గమనించి పారిశ్రామికవేత్త తనిఖీ అధికారిని లోబరుచుకునే ప్రయత్నం చేసెను. కేసు పెడితే దాదాపుగా 3 లక్షల రూపాయల సొమ్ము నష్ట పోవాలి. కోర్టుల చుట్టూ తిరగాలి. ఎంతో సమయం వ్యర్థం

అవుతుంది. వీటన్నింటిని దృష్టిలో ఉంచుకొని తనిఖీ అధికారిని ప్రాధేయపడెను. ఆయన ససేమిరా అనడంతో దండోపాయానికి దిగెను.

అధికారి ఫ్యాక్టరీ నుంచి పారిపోయే ప్రయత్నం చేయగా చివరకు ఆయనను పట్టుకొని బాయిలర్ లోనికి వేసి హత్య చేశాడు. ఇది ఈనాటి మాట కాదు. దాదాపుగా 10 సంవత్సరాల కిందట జరిగిన సంఘటన. పారిశ్రామిక వేత్తనే హత్య చేశాడని ఆరోపణ వచ్చింది. శవం ఎక్కడ. చివరికి పారిశ్రామిక వేత్తపై కేసు కూడ పెట్టడానికి వీలు కాకపోయిందని తెలిసింది. కారణం తనిఖీ అధికారి పారిపోయాడన్న ఓ పుకారును వ్యాప్తి చేశారు. నిజమేమిటో ఎవ్వరికీ తెలియదు. ఇలా జరిగిందని వీరు, అలా ఏమీ జరగలేదు అని వారు ఇలా కాలం జరిగిపోయింది. చివరికి ఈ పారిశ్రామిక వేత్త ఫ్యాక్టరీకు తనిఖీ చేయు అధికారులు వచ్చినప్పుడు వెంట పోలీసులను తీసుకొని వచ్చేవారు. లంచ గొండులకు ఈయన వల్ల రోజూ పండగే. నిజాయితీ అధికారులకు రోజూ సంకటమే. హతుడయ్యాడని భావించిన అధికారి భార్య పారిశ్రామిక వేత్త గృహమునకు వచ్చి భయానకమైన శాపనార్థమును చేసినదని తెలిసినది. కుక్క చావు చస్తావు, నిన్ను ఆ దేవుడు కూడా కాపాడలేడు అని ఇతరత్రా శాపము వదిలి వెళ్లిందట. ఆవిడ మహా దైవ భక్తి పరురాలని తెలుసుకొని ఈ ప్రారిశ్రామిక వేత్త ఎన్నో గుళ్లు, గోపురాలు తిరిగి ఎందరినో సాధువులను కూడా కలిసి భవిష్యత్తు ఏమవుతుందోనని తెలుసుకో ప్రయత్నించెను.

అంతట ఇతని మిత్రుడొకడు ఇచ్చిన సలహాతో ఓ మఠాధిపతిని ఆశ్రయించి అనేక రీతులా ప్రాధేయపడి భవిష్యత్తు గురించి తెలుసుకో కోరెను. ఎందుకో తెలియదు కానీ ఆ మఠాధిపతి మాత్రం ఈ పారిశ్రామిక వేత్త భవిష్యత్తును తెలపడానికి మొదట ఇష్టం చూపలేదు. మూడు దినముల తర్వాత కరుణించిన ఆ మఠాధిపతి ఈ పారిశ్రామిక వేత్తతో మాట్లాడడానికి నిర్ణయించుకొని “వచ్చే సంవత్సరం” అనే మాట మాత్రం చెప్పి లోనికి వెళ్లి పోయెను. దీని అర్థమేమిటో ఎంతగా జుట్టు పీక్కున్నా పారిశ్రామిక వేత్తకు అర్థం కాలేదు. చివరకు మఠాధిపతుల ముఖ్య శిష్యుడిని కలిసి ప్రాధేయపడి విషయమేమిటో తెలుసుకోకోరెను. అంతయూ అర్థము చేసుకున్న ముఖ్య శిష్యుడు వచ్చే సంవత్సరం నీకు దండన ఉండవచ్చు అనే రీతిలో చెప్పి ఆయన కూడా ఎక్కువగా చెప్పడానికి ఇష్టం లేదన్నట్లుగా లోనికి వెళ్లిపోయెను.

పారిశ్రామిక వేత్తకు విషయము అర్థమయ్యెను. తన ఊరికి వెళ్లిన తోడనే మూడు దినములు ఇంటి నుంచి బయటకు రాక పరిష్కార మార్గం కోసం యోచన చేసి చేసి చివరకు తన ఆప్త మిత్రులను పిలిపించుకొని వారిచే కూడా తగిన సలహాలను పొంది చివరకు అందరూ ఒక నిర్ణయానికి వచ్చిరి. అదే వాస్తు శాస్త్ర సహాయమును పొందాలని.

ఏ మాత్రం ఖర్చుకు వెనకాడని పారిశ్రామిక వేత్త ఆంధ్రా నుండి ఓ వాస్తు శాస్త్ర ప్రావీణ్యున్ని సంప్రదించి ఉన్న ఫళంగా రమ్మని తెలిపి ఆయన అడిగినంత రుసుము ఇవ్వడానికి సిద్ధపడి ఆయన రావడానికి అన్ని ఏర్పాట్లు చేసెను. మంచి ఆలోచన చేసితిమని తలచి చక్కటి నిర్ణయం తీసుకున్నామని తృప్తి పడి హాయిగా మధ్యపానం సేవించి నిద్రపోయెను.

మరుసటి ఉదయమే ఇంటి ముందు ఓ సాధువు కనిపించడంతో ఆయనను లోనకు ఆహ్వానించి తగిన రీతిన సత్కరించి, జరిగిన సంఘటనను చూచాయగా చెప్పెను. అంతట ఆ సాధువు ఇచ్చిన సలహాతో తనిఖీ అధికారి ఇంటికి వెళ్లి ఆయన భార్యకు అధిక మొత్తంలో నగదు ఇచ్చి సంతృప్తి చెంది ఆశీర్వదించమ్మా అని కోరెను. ఆవిడ కనీసం ఒక్క పైసా కూడా ముట్టక వినాశకాలే విపరీత బుద్ధి: అనే మాటను మాట్లాడి పారిశ్రామిక వేత్తను బయటకు పంపెను.

ఎందుకో తెలియదు కానీ ఎన్నో తప్పులు చేసినా బెదరని ఆ పారిశ్రామిక వేత్త ఈ విషయంలో మాత్రం ఓ స్త్రీ పెట్టిన శాపానికి కంగారుపడిపో సాగెను. చూచాయగా ఏదో జరుగబోతోందనే సంకేతం మాత్రం అందినట్లుగా పారిశ్రామిక వేత్త భావిస్తూ వచ్చెను.

వాస్తు శాస్త్రవేత్త పారిశ్రామిక వేత్త గృహానికి వచ్చెను. వాస్తు శాస్త్రవేత్తకు విషయమంతయూ విశదీకరించి ఎంత ఖర్చు అయిననూ ఫర్వాలేదు, ఈ గండం నుంచి గట్టెక్కించాలని కోరి గృహములో శాస్త్రవేత్త చెప్పిన విధంగా అన్ని మార్పులు చేసెను. వాస్తు మార్పులు చేసిన తర్వాత పారిశ్రామిక వేత్త భయం కూడా విచిత్రమైన రీతిలో తొలగి పోయెను. ఆదాయము అధికమయ్యెను. వ్యాపారము విస్తరించెను. మాసములు గడుస్తుండగానే జరిగిన సంఘటలన్నింటినీ మరపుకు వచ్చెను. జరిగిన విషయం స్ఫురణకు రావడం లేదు. వ్యాపారం విస్తరించడంతో ఇంకొక ఫ్యాక్టరీ వేయ సంకల్పించెను.

కొత్త ఫ్యాక్టరీ కట్టు ఉద్ధేశ్యంలో ఉండగానే, ఓ దివాళా తీసిన కంపెనీ తక్కువ ధరకు వస్తుండడంతో ఆలస్యం చేయక కొనెను. ఈ ఫ్యాక్టరీలో తనకు కావాల్సిన విధంగా నిర్మాణములు సాగించుకొనెను. ఫ్యాక్టరీ స్థలం చాలా పెద్దది. తనకు అందుబాటులో ఉన్న వేరే ఇంకొక వాస్తు పరిచయం గల ఓ వ్యక్తితో కొత్తగా కొన్న ఫ్యాక్టరీని చూపించుకొని తగిన వాస్తు సవరణలను కావించెను.

ఇవన్నియూ ఇలా జరుతుండగనే సంవత్సరం మార్పు చెందెను. "వచ్చే సంవత్సరం" వచ్చినది. పారిశ్రామిక వేత్తకు పట్టిందే బంగారమవుతున్నది. విపరీతమైన ధనాదాయం పెరిగినది. కొత్త ఫ్యాక్టరీ మొదలయ్యి అప్పుడే రెండు మాసములు అయ్యెను. ఇందు తయారయ్యే సరుకు కూడా బాగా వేగంగా మార్కెట్‌లోకి వెళ్తున్నది. అంతా సంతోషమే.

**"విధి"** తన కార్యమును పారిశ్రామిక వేత్తపై సాధించుకోవడానికి బయలుదేరెను. ముందుగా **"విధి"** పారిశ్రామిక వేత్త గృహాన్ని పరిశీలించెను. అందు ఏ దోషమూ కానరాలేదు. అయితే జాతక రీత్యా పారిశ్రామిక వేత్తకు మరణం ఆసన్నమైనది. దానిని నిర్వర్తించాలంటే **"విధి"** తన పని తాను చేయాల్సిందే కదా! జాతక రీత్యా సమయం ముగిసింది. వాస్తు రీత్యా కూడా అవకాశం చిక్కితే **"విధి"** కొట్టడం ఖాయం. కానీ అద్భుతమైన వాస్తు మార్పులు కలిగిన గృహములో పారిశ్రామిక వేత్త నివసిస్తున్నాడు. ఏ రీతిలో అతన్ని దెబ్బ కొట్టాలన్నా, ఏ చిన్నపాటి వాస్తు దోషము కూడా **"విధి"**కి లభించలేదు. మహా శక్తివంతురాలైన **"విధి"** కి చిరాకెత్తింది. సమయం చాలా దగ్గరకు వచ్చింది. ఇక కేవలం మూడు దినాలలో పారిశ్రామిక వేత్తను కొట్టాలి. ఎక్కడా మార్గం కనిపించలేదు. పారిశ్రామిక వేత్త కొత్తగా నిర్మాణం కావించిన ఫ్యాక్టరీకి వెళ్లి చూసిన **"విధి"** చక్కటి ఓ వాస్తు దోషము ఉపకరించింది. అదియే యజమాని అయిన పారిశ్రామిక వేత్త కూర్చునే ఆఫీసు గది బయట నైరుతి భాగంలో కార్మికులు కాళ్లు కడుక్కొను నిమిత్తం ఓ నల్లా (కొళాయి, క్యాప్)ను ఏర్పాటు చేసుకొని ఓ చిన్నపాటి గుంతను చేసి ఉండిరి. అదియును కాక ఫ్యాక్టరీ దక్షిణ గోడ పారును కార్యాలయం గది తప్పి దక్షిణం ప్రక్కగా వెళ్లినది. దీనివల్ల ఫ్యాక్టరీకి, ఫ్యాక్టరీ యొక్క ప్రహరీ గోడకు మధ్యన ఖాళీ స్థలము (దక్షిణ ఖాళీ స్థలము) యజమాని కూర్చోను కార్యాలయమునకు పశ్చిమ నైరుతి వీధిపోటులా రూపాంతరం చెందెను. తనకు దొరికిన వాస్తు దోషాలను చూసి **"విధి"** వికటాట్టహాసం చేసెను. ఇక పతకం రూపొందించుకొనెను. అమలు చేసి తృప్తిగా అటు నుంచి వెళ్లి పోయెను.

ధర్మపరమైన దండన పారిశ్రామిక వేత్తకు సిద్ధమయ్యెను. ఓ స్నేహితుని కుమార్తె వివాహమునకు హాజరు కావాల్సి రావడంతో పెళ్లికి హాజరై ఎప్పుడూ లేని విధంగా అక్కడే వారు సిద్ధం చేసి ఉన్న విడిదిలో

ఉండెను. పాత స్నేహితులందరూ కలవడం, అందరూ ఖుషీగా మధ్యపానం సేవిస్తూ పేక ముక్కలు ఆడుకుంటూ మూడు దినాల సమయాన్ని గడిపిరి. **"విధి"** యొక్క శక్తి ఇక్కడ కూడా ప్రసరించెను. పారిశ్రామిక వేత్త ఉన్న గదికి దక్షిణ నైరుతి ద్వారము కలదు. ఆశ్చర్యమేమిటంటే వీరు విడిది చేసియున్న ఇంటికి దక్షిణ నైరుతి ద్వారము కలదు. కేవలం మూడే మూడు దినాలలో రాజ భోగాలను అనుభవించ సాగెను. సమయం అయిన పిదప వివాహ కార్యము ముగిసిన తర్వాత ఎవరి ఊళ్లకు వారు బయలుదేర సాగిరి. పారిశ్రామిక వేత్త తన డ్రైవర్ ఇంకొక స్నేహితునితో తిరుగు ప్రయాణమయ్యెను. డ్రైవర్ ప్రక్కనే పారిశ్రామిక వేత్త, డ్రైవర్ వెనుక పారిశ్రామిక వేత్త స్నేహితుడు కూర్చోని వుండెను. రాత్రి 8 గంటల సమయంలో రహదారిపై కారులో వెళ్తుండగా వీరి కారు ముందే ఇనుప కడ్డీలను తీసుకు వెళ్తున్న ఓ లారీ వెళ్తున్నది. ఓ పంది అడ్డు రావడంతో లారీ డ్రైవర్ అయోమయంతో సడన్ బ్రేక్ వేసెను. లారీ వెనుకనే వేగంగా వస్తున్న కారు సడన్ బ్రేక్ వేసేంతలోపే లారీకి దగ్గరదగ్గరగా వెళ్లి పోయెను. కొస్సిగా ఉన్న కడ్డీలలో ఒకటి కారు అద్దమును చీల్చుకుంటూ పారిశ్రామిక వేత్త గుండెలోకి దిగెను. ఒక్క నిమిషం వ్యవధిలోనే పారిశ్రామిక వేత్త ప్రాణం పోయెను. అతను చనిపోయే సమయంలో మఠాదిపతి చెప్పిన "వచ్చే సంవత్సరం" అను విషయం ఉచ్చరించి పోయెను. **"విధి"** కి అప్పగించిన పని పూర్తి అయ్యింది. వాస్తు శాస్త్రం యందలి అతి చిన్న కారణాలను లొసుగులుగా తీసుకొని పారిశ్రామిక వేత్తను శిక్షించెను. విధి శక్తి మరోసారి రుజువయ్యెను.

ఎంత ఖర్చుకైననూ వెనకాడని పారిశ్రామిక వేత్త ఎంతో ఖర్చు పెట్టి పిలిపించిన వాస్తు శాస్త్రవేత్తచే గృహమును చూపించనే కానీ తను కొత్తగా తీసుకున్న ఇంకొక ఫ్యాక్టరీకి వాస్తు చూపించుకోలేక పోయెను. తిరిగి ఖర్చు పెట్టి ఆంధ్రా నుంచి వాస్తు సిద్ధాంతిని ఎందుకు పిలిపించాలని, తనకున్న వాస్తు తెలివి తేటలతోనే వాస్తు సవరణలు చేసుకుందామని తలచి తగిన విధంగా వాస్తు సవరణలు చేసుకొని మిడిమిడి జ్ఞానం కల ఓ వాస్తు శాస్త్రవేత్తనని చెప్పుకొనే వ్యక్తిచే ఓసారి పరిశీలింప చేయించుకొని మరొకసారి చిన్న మార్పులు చేయించి తృప్తి పడెను. అయితే జరిగిన ఒక అతి పొరపాటును **"విధి"** తన ఆయుధంగా మలుచుకొనెను. అది ఏమిటో తర్వాత చూద్దాము.

ధర్మో రక్షతి రక్షిత: ధర్మమును తప్పితే అదే ఆ ధర్మమును తప్పిన వ్యక్తిని ధర్మము శిక్షింపదలిస్తే ఏ శాస్త్రం కూడా ధర్మమును తప్పిన వారిని కాపాడజాలదు.

**"విధి"** ఒక్కటే భగవంతుని శక్తి కాదు. భగవంతుని దగ్గర కొలవడానికి వీలు లేనంతటి లెక్కకు మిక్కిలి శక్తులు కలవు. భగవంతుని దగ్గర **"విధి"** అనునది ఓ చిన్నపాటి శక్తి మాత్రమే. బొంగరము ఆడినట్లుగా **"విధి"** మనిషిని ఆడిస్తుంటుంది. ప్రజలు రాజకీయ నాయకుల చేతుల్లో ఇరుక్కున్నట్లుగా విధి భగవంతుని చేతనే వుంటుంది. భగవంతుడు సర్వ శక్తిమంతుడు, విశ్వ రక్షకుడు.

భగవంతున్ని నిందించినా పట్టించుకోడట. కానీ భక్తుణ్ణి నిందించినా, హింసించినా ఏ మాత్రం ఓర్చుకోడట. తనిఖీ అధికారి భార్య మహా ఇల్లాలు. పరమ భక్తి పరురాలు, సాధ్వి. ఆవిడ శాపానికి పారిశ్రామిక వేత్త మట్టి కొట్టుకు పోయాడు. ఏమి జరుగుతుందో ఏమోనని అడ్డమైన వారిచే రక రకాల తాయత్తులు కట్టించుకున్నాడు. తాయత్తులు అధికం కావడంతో వాటి బరువుకు శరీరం కూడా వంగినది. ఏం చేస్తే ఏమి ప్రయోజనం చివరికి **"విధి"**కి చిక్కక తప్పలేదు. **"విధి"** శక్తి ముందు మనం ఎంతటి వారము.

ఇతరులను హింస పెట్టడం ఎప్పటికీ మంచిది కాదు. **"విధి"** ఒకటి ఉంది అనే విషయం మనకెప్పటికీ స్ఫురణకు రావాల్సి వుంటుంది. సర్వ శక్తిమంతుడైన భగవంతుడు ఉన్నాడనే విషయం ఎప్పటికీ మరువరాదు.

రక్షకుడు, శిక్షకుడు ఆయనే. తస్మాత్ జాగ్రత్త.

అప్రస్తుతము అనుకోకపోతే **"విధి"** గురించి మనము ఇంకా ఎన్నో విషయాలను తెలుసుకోవలసి వుంది. ఈ పుస్తకములో **"విధి"** గురించి ఇంత ఎక్కువగా చెప్పడము అవసరమేనా? ఈ పుస్తకం పేరే పరిసర వాస్తు. అనగా మన గృహమును దాటి పని చేస్తున్న పరిసరాల యొక్క వాస్తు ప్రభావము.

నిజం చెప్పాలంటే **"విధి"** గురించి ఎక్కువగా తెలుసుకోవడం మంచిది కాదు. కానీ పరిసర వాస్తు పుస్తకంలో **"విధి"** గురించి తెలుసుకోవడం అత్యంత ప్రాముఖ్యమైన విషయంగా గమనించి చూచాయిగా కొన్ని సంఘటనలను మాత్రమే తెలపడం జరుగుతున్నది.

కన్నూ మిన్నూ కానరాని ఓ రాజకీయ నాయకుని గురించి తెలుసుకుందాము. దక్షిణ భారతదేశంలోని ఓ రాష్ట్రంలోని ఒక పట్టణం యందు ఓ రాజకీయవేత్త వుండెడివారు. వీరి కుటుంబం రాజకీయ కుటుంబం కాదు. ఆయాచితంగా ఇతనికి మాత్రం రాజకీయ పీఠం దక్కినది. ఓ మోస్తరు రాజకీయ అధికారం, అధికార దర్పము ఏర్పడినది. ఇంక ఏముంది కన్నూ మిన్నూ కానరాకుండా తన స్వంత బంధువులు అని కూడా చూడకుండా, అవసరంలో ఉన్నప్పుడు ఆదుకున్న స్నేహితులు అని కూడా చూడకుండా, స్వయానా రక్త సంబంధం అని కూడా స్పృహ లేకుండా విర్రవీగి పోవడం మొదలుపెట్టాడు. ఇతనిపై అధిక జనులకు, బంధువులకు, స్నేహితులకు మంటగా వుండెడిది. పనిలో పనిగా ఓ తల్లి కడుపు కోతను కూడా ఈ రాజకీయ వేత్త చూశాడు. ఒకటా రెండా ఎందరో ప్రజల శాపనార్థాలు ఈ రాజకీయ వేత్తకు తగిలాయి. శాపనార్థాలు తగిలే కొద్దీ క్రొవ్వు పెరిగి పోవడంతో వీరంగం సృష్టించడం మొదలు పెట్టాడు. రాజకీయ అధికారం వచ్చింది. ఏమంటే ఏమవుతుందోనన్న భయంతో ప్రజలు కూడా ఇతనిని ఎదురుగా ఏమీ మాట్లాడే వారు కాదు. మనస్సులోనే కుళ్లిపోయెడి వారు.

ఈ విశ్వంలో ప్రకృతి శక్తి అతి బలీయమైనది. ప్రకృతిని మనకు అనుగుణంగా మలచుకొని, బుజ్జగించి మన కార్యక్రమములను కొనసాగించు కోవాలి. ప్రకృతికి ఎదురు తిరగడం వల్ల నష్టపోయేది మనమే. ధర్మము అనునది కూడా ఈ ప్రకృతిలో ఒక భాగము కింద తీసుకోవచ్చును. ధర్మమును ఆచరించడము అతి ముఖ్యమైనది. అధర్మముగా ప్రవర్తించిన వారు శిక్ష పొందడం ఈ ప్రకృతి ధర్మము. వారు వారు చేసుకున్న పాప, పుణ్య కార్యములను బట్టి శిక్ష ఎక్కువ లేదా తక్కువ, శిక్షను ఆలస్యంగా అమలు చేయడమా లేక త్వరగా అమలు చేయడమా అను విషయము ఆధారపడి ఉంటుంది. పాప కార్యములు ఎక్కువ చేసిన వారు త్వరగా శిక్షింపబడటం జరుగుతుంది. ఈ శిక్ష అనునది ఎవరు వేస్తారు. ఈ శిక్షకు అధికారి ఎవరు. ధర్మము, ప్రకృతి, భగవంతుడు. వీరిలో ఎవరినైనా అనుకోవచ్చును. ఒక్కసారి శిక్ష ఖరారు అయిన తర్వాత దానిని అమలు చేసే అధికారం **"విధి"**కి ఇవ్వబడుతుంది. ఒక్కసారి "విధి"కి శిక్ష కార్యక్రమమును అమలు చేయమని తెలియజేసిన తర్వాత "విధి" తన పని తాను నిర్వర్తిస్తుంది. "పని" జరగడం కోసం "విధి" ఎంతకైననూ తెగిస్తుంది. "విధి"కి కావలసినది ఒకటే. తనకు అప్పజెప్పిన పనిని ముగించడం. సర్వ శక్తిమంతురాలైన "విధి" పనిని ముగించుకోవడానికి ఒక్కసారి బయలుదేరిందంటే పని ముగియందే వెనక్కు రాదు.

ఈ ధర్మ సూక్ష్మములు ఏమీ తెలియని రాజకీయ వేత్త తన చతురతతో, తెలివి తేటలతో ప్రతీ ఒక విషయంలోనూ జాగ్రత్తలు తీసుకున్నాడు. ఓ సాధువు చెప్పిన విధంగా అవసరమైన కృతులు కావించాడు. హోమములు ముగిసినవి. గొప్ప పేరు ప్రఖ్యాతులు వున్న ఓ ప్రముఖ వాస్తు శాస్త్రవేత్తను పిలిపించుకొని మూడు దినములు అతనికి అన్ని అనుకూలములు గావించి, సరియైన విధంగా ఆయనచే పూర్తి సలహాలను పొంది

వాటిని పాటించడం జరిగినది.

అన్ని జాగ్రత్తలు తీసుకున్న రాజకీయ వేత్త ఇంకా దురాలోచన, దూరాలోచన కావించి ప్రముఖ జ్యోతిష విధ్వాంషునిచే తన జాతకమును చక్కగా పరిశీలింప చేయించుకొని అతి ముఖ్యమైన నవరత్నములలో కొన్నింటిని ధరింప చేసుకోవడం కూడా జరిగినది. ఫెంగ్‌షూయ్ అను చైనా శాస్త్రంలో ప్రావీణ్యుడైన ఓ వ్యక్తిని పిలిపించుకొని వాటిలో కూడా తగిన మార్పులు, చేర్పులు చేసుకొని కావలసిన వస్తువులను పొంది తగిన రీతిలో గృహములో ఉంచుకోవడం జరిగినది.

తనకు తెలిసిన శాస్త్రములన్నింటిని పాటించాడు. కావలసినంత డబ్బు వస్తున్నది. ఇంటి స్త్రీయే కాక పరాయి స్త్రీని కామించాడు. ఎలాగో అన్ని తెలివితేటలు ఉపయోగించి లోబర్చుకున్నాడు.

శాపనార్థముల బలము పెరిగి “విధి”కి ఒక పని అప్పజెప్పడము జరిగినది. ఈ రాజకీయ వేత్త అంకమును ముగించమని.

రాజకీయ నాయకుని గృహమునకు వెళ్లిన “విధి”కి అన్నీ ఆటంకాలే. ఏ రీతిలో చూసినా రాజకీయ నాయకున్ని దెబ్బ కొట్టడానికి అవకాశమే లేకుండా పోయింది. “విధి” ఆలోచన చేసినది. క్షణములో లక్షోవంతులో “విధి”కి ఉపాయం తట్టింది. రాజకీయ వేత్త గృహము బయట నైరుతిన గల వేరే గృహస్థుని గృహముపై “విధి” తన గురిని చూపింది. ఆ దినం రాత్రి అతి భయంకరమైన వర్షం కురిసింది. నైరుతిన గల పాత కాలం నాటి గృహం ఒక్కసారిగా కూలిపోయింది. ఆ కూలడం కూడా రాజకీయ వేత్త నైరుతి ప్రహారీని తొలగించుకొని బ్రద్ధలు చేసుకొని కూలిపోయింది. ఈ సాకును తీసుకొని నిరభ్యంతరంగా “విధి” రాజకీయ నాయకుని గృహము యందు ప్రవేశించి నిర్దయగా రాజకీయ నాయకునికి మరణాన్ని ప్రసాదించింది. మూడు చుక్కల తలకు రాసుకునే నూనెను మరణానికి ఆయుధంగా మలచుకొని రాజకీయ నాయకుని ఆయుస్సు తీసింది.

గారాభం చేస్తున్న చిన్న పిల్లవాడి తలకు నూనె పట్టించడం కోసం తల్లి అబ్బాయిని పట్టుకోవడం, అబ్బాయి పారిపోవడం, ఈ ఆటలో అబ్బాయి బాత్‌రూమ్‌లోకి వెళ్లడం, అక్కడ తల్లి చేతికి చిక్కడం, తలకు నూనె పెట్టించుకోవడం జరిగాయి. అయితే నూనె పెట్టే సమయంలో మూడు చుక్కలు మాత్రం బాత్‌రూమ్ యందలి ఫ్లోరింగ్‌పై పడినది. ఆ మూడు చుక్కలే రాజకీయ నాయకుని పాలిట యమపాశమై ఆ నూనెపై కాలు పెట్టి జారి దబ్బున ఒక్కసారిగా నేలపై పడి గుండె కొట్టుకోవడం ఆగిపోయి తన జీవితంలోని చిట్టచివరి శ్వాసను వదిలేశాడు.

నైరుతిలో గృహము లేనంత మాత్రాన నైరుతి ప్రహారీ కూలినంత మాత్రాన ఆ ఇంట గృహ యజమాని తక్షణమే మరణించడం జరుగకపోవచ్చు. అయితే ఇవి “విధి”కి అత్యంత అనుకూలమైన ఆయుధాలుగా పనికి వచ్చి “విధి” కార్యములో పాలుపంచుకున్నాయి.

ఒక పూట ఆహారమును ఆలస్యముగా తీసుకున్నా ఫర్వాలేదు. కానీ వాస్తు విషయంగా నిర్లక్ష్యం చేయడం ఎప్పటికీ తగదు.

“విధి” యొక్క శక్తిని గురించి చెప్పడానికి సాధ్యం కాకపోవచ్చును. అయితే ఏమో ఒకటీ రెండు ఉదాహరణలు మాత్రం తెలుసుకొని “విధి” యొక్క శక్తిని అంచనా వేసుకోవాలి. తిరుమల కొండపై ఎక్కడ చూసినా ఒక సూత్రం కనిపిస్తూ ఉంటుంది. “ధర్మాన్ని ఆచరించండి, ఆ ధర్మమే మిమ్ములను కాపాడుతుంది” ఈ పదాలను తిరుమలకు వెళ్లిన వాళ్లు ఎన్నోసార్లు గమనించి ఉండవచ్చును. కానీ దీని అర్థమును మాత్రం అతి లోతుగా పరిశీలన కావించి ఉండరు. కానీ ఇక ఈసారి మాత్రం తిరుమలకు వెళ్లినప్పుడు ధర్మము యొక్క

శక్తి, "విధి" యొక్క శక్తి గుర్తుకు రాకమానదు. అలాగే నన్ను కూడా గుర్తుకు తెచ్చుకుంటారు. మీరు బుద్ధిమంతులు. ధర్మమును వీడక ప్రయోజకులై మీ కుటుంబమునకు పేరు తెస్తారు. మీ జీవితంలో అభివృద్ధి సూచి ఉంది కాబట్టే మీరు ఈ పుస్తకమును మరియు ఈ వ్యాసమును చదివారు. ఈ వ్యాసములు చదివిన వారు తప్పకుండా బాగుపడుతారు, సంఘానికి పనికి వస్తారు. సంఘ విద్రోహులుగా మాత్రం మారరు.

హైదరాబాద్ నుంచి నాకు ఒక విచిత్రమైన కాల్ వచ్చినది. ఫోన్ చేసిన వాడు ఒక దొంగ. ఆ దొంగ ఇలా మాట్లాడాడు. "సార్! నా బ్రతుకు తెరువు కోసం రెండు ప్రయత్నాలు చేసినా ఫలించక దొంగతనాలకు అలవాటు పడ్డాను. మీ పుస్తకం ఈ దినం ఉదయం చదివాను. అందులో మీరు వ్రాసిన కష్టేఫలి అను వ్యాసమును చదివి నా చెప్పుతో నేను కొట్టుకున్నాను. మీ పుస్తకమును కూడా దొంగతనముగా కొట్టుకొచ్చినదే. డబ్బు పెట్టి కొనింది కాదు. ఇక జీవితంలో దొంగతనము చేయను. కడుపుకు ఆహారం లేకపోయినా మరణిస్తాను కానీ దొంగతనం మాత్రం చేయను. ఇతరుల సొమ్ము అక్రమంగా సంపాదించను. ఇక నీతిగా బ్రతుకుతాను. మీ పుస్తకమే నా చివరి దొంగతనం, ఉంటాను నమస్తే" అని చెప్పి, పేరు అడుగబోయేంతలో ఫోన్ పెట్టేశాడు. ఆ రోజు పొందిన సంతోషం అంతా ఇంతా కాదు. ఎంతో మంది నన్ను వాస్తుకు రమ్మని పిలుస్తుంటారు. ఒక్కోసారి తక్కువ ఫీజులు ఒక్కోసారి ఎక్కువ ఫీజులు రావచ్చును. ఎన్ని చేసినా, ఏమి సాధించినా రాని తృప్తి దొంగ నుంచి వచ్చిన ఫోన్ కాల్తో లభించిన తృప్తి వెల కట్టలేనిది. ఒక వ్యక్తిలో మార్పు రావడము అనేది కష్టము. అటువంటి మార్పును నా వ్యాసము తెచ్చినందులకు సంతోషంతో పొంగిపోయాను. ఇంత పెద్ద అవార్డు నాకు వస్తుందని కలలో కూడా ఊహించలేదు. ఇదే నిజమైన అవార్డు. దొంగ గారికి థ్యాంక్స్.

ధర్మాన్ని ఆచరిస్తే కష్టములు తప్పవు. అధర్మముగా ప్రవర్తిస్తే సుఖ పడుదురు. మరి మీరు ఏది కోరుకుంటారు. ధర్మమునా, అధర్మమునా? కష్టం కావాలా? సుఖం కావాలా? ఎవరైనా కోరుకునేది సుఖమే కదా! మరి అధర్మమును పాటిద్దామా?

జ్ఞానం తక్కువగా గల కొందరి జనులకు ఇటువంటి ఆలోచనలు రావడం ఖద్దు. ధర్మము నుంచి వచ్చే కష్టాలు అతి స్వల్ప సమయం మాత్రమే. అధర్మము నుంచి వచ్చే సుఖాలు కూడా స్వల్ప సమయమే. దీర్ఘకాల ప్రయోజనాలు మనకు ముఖ్యము. దీర్ఘకాల ప్రయోజనములను కూడా ఈ పై రెండూ ఇస్తాయి. ధర్మము యొక్క దీర్ఘకాల ప్రయోజనం శాంతి, తృప్తికరమైన జీవనం సంఘములో మంచి పేరు, పిల్లలు అభివృద్ధిలోకి రావడం, ఇతరత్రా. అధర్మము యొక్క దీర్ఘకాల ప్రయోజనం, అశాంతి, సర్వనాశనం, టెన్షన్లు, దరిద్ర్యం, కోపం, కామం ఇతరత్రా.

ఇప్పుడు మీకు ఏది కావాలో నిర్ణయించుకోండి ధర్మమా? అధర్మమమా? మీరు బుద్ధిమంతులని మనము ఇంతకు ముందే తెలుసుకున్నాము కదా! మీరు తప్పకుండా ధర్మమునకే ఓటు వేస్తారు. మీలాంటి వారు ఎక్కువుగా ఉండబట్టే ఈ సమాజం ఇంకా ముందుకు నడుస్తున్నది. లేకపోతే ఏనాడో ఏడారి అయ్యేది.

వాస్తు శాస్త్రవేత్తలలో ఎన్నో రకాలు ఉంటారు. అత్యంత ప్రావీణ్యత గల వాస్తు శాస్త్రవేత్తకు కూడా ముచ్చెమటలు పట్టించేదే ఈ పరిసర వాస్తు. పేరు ప్రఖ్యాతలు గల సమాజ శ్రేయస్సు కోరే ప్రజల హితం ఆశించే ఏ వాస్తు శాస్త్రవేత్త అయినా తనచే వాస్తు చూపించుకున్న వాళ్లు బాగుండాలని తలుస్తాడు. కానీ అతి ప్రాముఖ్యమైన, అతి సూక్ష్మమైన, భవిష్యత్తులో ఎదురు కాబోయే పరిసర వాస్తు యొక్క లోతైన శక్తిని గృహస్థుడు గమనించలేడు. అయితే ప్రావీణ్యుడైన వాస్తు శాస్త్రవేత్తకు కొన్ని విషయాలు ముందుగానే అవగతమవుతాయి. కానీ గృహస్థునికి చెప్పినా కొందరు పట్టించుకోరు. అదే ఆ వాస్తు శాస్త్రవేత్తకు తలనొప్పిగా లేదా చెడ్డ పేరును

తీసుకొని వస్తుంది.

అందుకే ప్రతి ఒక గృహస్థుడు గమనించాల్సిన విషయం ఏమిటంటే వాస్తు శాస్త్రవేత్త చెప్పిన ప్రతి ఒక విషయమును శ్రద్ధగా గమనించి యుద్ధ ప్రాతిపదికన చెప్పిన సవరణలను పూర్తి కావించడం మంచిది. అయితే ఇక్కడ ఒక ముఖ్యమైన విషయమును గమనించవలెను. అదియే మీరు ఎన్నుకునే వాస్తు శాస్త్రవేత్త.

మీరు బజారులో వెళుతూ వుంటారు. దారిలో గల ఓ పాత జీపు యొక్క చిన్న రేకుకు గుచ్చుకొని మీ ప్యాంటు చినిగిపోయింది. కర్మ అనుకొని ఎలాగో గృహానికి చేరుకొని ఇంకొక ప్యాంటును వేసుకుంటారు. ఒక ప్యాంటు పోతే ఇంకొక ప్యాంట్ వుంటుంది. **కానీ జీవితం ఒకటే.** ప్యాంటులాగా జీవితాన్ని మార్చుకోలేము. ఈ జన్మలో కాకపోతే ఇంకొక జన్మలో సాధించుకుందాములే అనుకోవడము మూర్ఖమే. క్షణం ఆలస్యం చేసినా నష్టపోయేది మనమే. మనిషి జీవితంపై వాస్తు యొక్క ప్రభావం చాలా ఎక్కువగా ఉంటుందనే విషయం మనకు తెలుసు. తెలిసినా కూడా నిర్లక్ష్యంగా ప్రవర్తించడము తగదు. కాసుల కోసం కక్కుర్తి పడి అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్తను కాకుండా మిడిమిడి జ్ఞానం గల వాస్తు చూస్తామని చెప్పే ఎవరిని పడితే వారిని మీ గృహానికి పిలిపించవద్దు. అప్పటికి అతనికి ఇచ్చే రుసుము చాలా తక్కువగా ఉండి మీరు క్షణ కాలం సంతోషానికి గురి కావచ్చును. కానీ జీవితాంతం అభివృద్ధిని అందుకోలేని స్థితిలోనే మీ జీవనం గడిచిపోతుంది. ఒక్కసారి ఒక ఉత్తమ ఫలితాలను ఇచ్చే వాస్తు శాస్త్రవేత్తను మీ గృహానికి పిలిపించడమంటే దీని అర్థము మీకు **అతి** త్వరలో దరిద్ర్యము ముగిసి అదృష్టము పడుతుంది అను విషయాన్ని గమనించాలి. ఇలా కాసులకు కక్కుర్తి పడి వాస్తుపై సరైన అవగాహన లేని ఓ వ్యక్తిచే వాస్తు చూపించుకొని సర్వ నాశనం అయిన ఓ వ్యక్తి గురించి తెలుసుకుందాము.

రాజేశ్వర్ రావు, ఊరు ఆంధ్రాలోని ఒక జిల్లా. పరమ మూర్ఖుడు. పట్టిందే వేదం. ఒకసారి నిర్ణయం తీసుకున్నాడంటే ఏది ఏమైనా ఇక వదలడు. ఎవరి మాట వినడు. ముందుగా ఇతను కిరాయిపై ఓ గృహమును అద్దెకు తీసుకున్నాడు. ఈ గృహమునకు కాస్త దూరంలో ఓ వాస్తు శాస్త్రవేత్త నివసించే వాడు. రహస్యంగా రాజేశ్వర్ రావు దగ్గరకు వెళ్లి గృహమును కిరాయికి తీసుకోవద్దు, ఈ గృహములో ఉన్న వారు నాశనం అయిపోతారని, అసలే నీకు ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె, వారి జీవితం నాశనం అవుతుందని భార్య ఎదురుగానే తెలిపినా, విన్నవించుకున్నా, విజ్ఞప్తి చేసినా, హెచ్చరించినా నీరు పడి బిగుసుకునే తాటి వేరు తాడులా రాజేశ్వర్ రావు బిగుసుకొని అదే గృహమును కిరాయికి తీసుకున్నాడు. వాస్తు శాస్త్రవేత్త మాటను పెడచెవిన పెట్టాడు. రెండు సంవత్సరాలు గడిచినంతనే రాజేశ్వర్ రావుకు అదృష్టం పట్టింది. ఉధృతంగా డబ్బు వచ్చింది. వాస్తు శాస్త్రవేత్త ఇంటికి వెళ్లి ఓనామాలు మరొకసారి నేర్చుకోమని, అవి నేర్చిన తర్వాత వాస్తును తిరిగి నేర్చుకుందువని తెలిపి తన ఇంటికి వెళ్లిపోయెను. బిత్తర పోయిన వాస్తు శాస్త్రవేత్తకు మాట రాలేదు. ఇంతకన్నా అవమానం ఇంకేమి కావాలి. అడగక పోయినా వెళ్లి చెప్పి వచ్చారే అని భార్య దెబ్బిపొడుపు మాటలతో మనస్సు కకావికలమాయెను.

3 సంవత్సరాల తర్వాత రాజేశ్వర్ రావు సుడి తిరిగి కిరాయికి ఉన్న గృహమును కొన ప్రయత్నించెను. ఇది తెలిసిన వాస్తు శాస్త్రవేత్త రాజేశ్వర్ రావు క్షేమమును కోరి మనస్సు చంపుకొని వెళ్లి నెత్తీనోరు కొట్టుకున్నా భరించరానంత అవమానమును నెత్తిన రుద్ది ఇంటి నుంచి బయటకు సాగనంపెను. అవమాన భరితుడైన వాస్తు శాస్త్రవేత్త రాజేశ్వర్ రావు కొనబోయే గృహమును బయటి నుంచి చూసుకుంటూ వెళ్లిపోతూ నీ సాలె గూడులో ఇంకొకరిని చిక్కించుకున్నావు కదమ్మా! శాంతించు తల్లి, ఈ మూర్ఖుడిని శిక్షింపవద్దు అనుకుంటూ వెళ్లి పోయాడు.

గృహమును రాజేశ్వర్ రావు తన పేరున రిజిష్టర్ కావించాడు. మరొకసారి దారిన పోయే ఓ దానయ్యను పిలిపించుకొని అతనిచే వాస్తు చూపించుకొని దాదాపుగా 5 లక్షలు ఖర్చు పెట్టి గృహమునకు మరమ్మత్తులు చేసి అతి సుందరంగా గృహమును అందంగా అలంకరించు కున్నాడు. కుమార్తె పెళ్లి నిశ్చయమాయెను. 20 దినముల తర్వాత కుమార్తె పెళ్లి అనగా గుటుక్కున రాజేశ్వర్ రావు మరణించాడు. ఆ ఇంట ఇక ఏడుపులే ఏడుపులు. అర్థాతరంగా ఆగిన కుమార్తె పెళ్లి, భర్త చావు అన్నీ జరిగిపోవడంతో భార్య ఆత్మహత్య చేసుకుందామనే తలంపుతో యాసిడ్ మింగడం మరణం అంచుకు వెళ్లి తిరిగి జీవచ్ఛవంగా బ్రతకడం, కళకళలాడిన ఒక కుటుంబం యందు శరాగాతంలా తగిలిన బలమైన దెబ్బలకు కుదేలైపోయారు. అలో లక్ష్మణా అంటూ తమను ఆదుకునే ఆపన్న హస్తం కోసం కుటుంబము ఎదురు చూసెను. చివరకు తెలివి తెచ్చుకున్న భార్య గృహమును కొనవద్దని తెలిపిన వాస్తు శాస్త్రవేత్త ఇంటికి వెళ్లి జరిగిన విషయములన్నియూ పూస గుచ్చినట్లుగా శాస్త్రవేత్తకు తెలిసిననూ మరియూ తెలిపి తమకు తక్షణమే సలహాను ఒసంగమని ప్రాధేయపడెను. ఇక్కడ ఒక ఆశ్చర్యకరమైన విషయము ఏమిటంటే గృహమును కొనవద్దని భార్య కాళ్లా వేళ్లా పడటం, భర్తచే తన్నులు తినడం కూడా జరిగినది. తలరాతలంటే ఇవేనేమో. జరిగేది జరగక మానదని పెద్దలు ఊరకే అనలేదు. పెద్దల మాట చద్దన్నము మూట. కాసులకు కక్కుర్తి పడి వాస్తు తెలియని వారిచే వాస్తు చూపించుకొని ఎందరో చావుదెబ్బలు తింటుంటారు. ఇదంతయూ వారి తలరాతగా అనుకోవలసి వస్తుందేమో. ఏదైతేనేం అనుభవించాల్సిన వాళ్లు అనుభవించక తప్పదు. ఎవరు చెప్పినా వినరు.

ఓ అకతాయి వెధవ చేసిన దుర్మార్గపు పనికి విధి ఎలాంటి శిక్షను విధించిందో చూద్దాము. ఇప్పుడు ఒక ధర్మాత్ముడు, బుద్ధిమంతుడు, ఉత్తముడైన ఓ ఉద్యోగి ఉదంతం చదవండి. కర్నాటక రాష్ట్రంలో దక్షిణ కన్నడ ప్రాంతంలోని ఒక ఊరిలో ఒక ఉద్యోగి ఉండెడి వాడు. ఈయన కరెంట్ ఆఫీసులో పని చేసేవాడు. ఈయనకు ఉన్న మంచి పేరు అంతా ఇంతా కాదు. కానీ ఇతని పక్కింటి వాడు ఒక దుర్మార్గుడు. ఒకానొకనాడు ఆ దుర్మార్గున్ని పిలిచి సమాజానికి పనికి వచ్చే వాడిలా ఎదగమని దుర్మార్గములను వదిలిపెట్టమని కాస్త కఠినంగా చెప్పెను. అది మనస్సులో పెట్టుకున్న ఆ దుర్మార్గుడు ఉద్యోగిని ఎవరికీ అనుమానం రాని రీతిలో హతమార్చెను. ఇందుకు ఒక స్నేహితుడు కూడా సహకరించెను. కాలక్రమంలో దుర్మార్గుడు అతి భయంకరమైన వినాశకాలమును రుచి చూసి నాశనమై అందరిచే ఉమ్మించుకొని మరణించెను. ఇతనికి సహాయం చేసిన స్నేహితుడు అతి భయంకరమైన క్యాన్సర్ రోగమునకు గురై తీసుకొని తీసుకొని మరణించెను.

అకతాయికి సహకరించిన స్నేహితుడిని విధి ఎలా పీడించిందో మరియు మరణాన్ని ఎలా రుచి చూపించిందో ఇప్పుడు చూద్దాము. స్నేహితుడి గృహమునకు పశ్చిమము యందు గల ఒక పాత గృహము కూలిపోయినది. దాన్ని కట్టించుకోవడానికి ఆ కూలీపోయిన గృహ యజమానికి స్థోమత లేక స్థలమును చదును చేసి వెళ్లిపోయెను. స్నేహితుడి గృహము యొక్క తూర్పు భాగమున భారీ మేడ వెలసెను. "విధి"కి కావాల్సిన ఆయుధం లభించెను. ఈ రెండింటిని ఆసరా చేసుకొని అనగా పశ్చిమము యొక్క ఖాళీ ప్రాంతమును తూర్పు నందు గల భారీ మేడను ఆయుధములుగా మలచుకొని దుర్మార్గుని స్నేహితున్ని పీడించి పీడించి నరక యాతనను చూపించి మూడు నిమిషాలకు ఒకసారి మరణము ఆసన్నము అయితే మేలు కదా అనుకునేలా అనారోగ్యాన్ని సృష్టించి, ఇంట ఉన్న ధనము అంతటినీ భస్మీపటలము కావించి బ్రతికి ఉండగనే నరకమును అతి స్పష్టముగా చూపించి చివరకు మరణమును ప్రసాదించెను. చేసిన పాపము ఊరకే పోదు. ఒక ఉత్తముడిని మింగిన పాపము అలా కక్షను సాధించుకొనెను. ధర్మము అనునది ఒకటి ఉంది. దాన్ని తప్పడం ఎప్పటికీ

మంచిది కాదు.

కాని పనులు చేయవద్దు. ఇతరుల ఉసురు అసలే వద్దు. పరాయి వారిని పీడిస్తే ఆ పాపము ఊరకే పోదు. తస్మాత్ జాగ్రత్త. మీరు బాగుండాలి. అందుకే మీకు బోరు కొట్టినా ఫర్వాలేదు అని తలచి ఇంతగా తెలపడమైనది.

ఒక్కోసారి గృహస్థుడు చేసిన పాపాల వల్ల వాస్తు శాస్త్రవేత్తకు కూడా వాటి శాకం తగిలే అవకాశం కూడా ఉంటుంది. వాస్తు శాస్త్రవేత్త ప్రతి ఒక్క విషయాన్ని దృష్టిలో ఉంచుకోవాలి. అప్పుడే తను క్షేమంగా ఉంటాడు, గృహస్థుడిని మంచి మార్గమునకు తీసుకు వెళ్లిన వాడవుతాడు.

విధి రాత అనునది సామాన్యమైన విషయం కాదు. ఈ విషయం వ్రాయడానికి ముందు మరియు వ్రాయు సమయంలోనూ కాస్త భయపడటం కూడా జరిగినది. కారణం విధి యొక్క శక్తిని బయటకు తెలపడం వల్ల నాకు ఏమైనా జరుగుతుందో ఏమోనని కాస్త భయపడిన మాట వాస్తవమే. కానీ భగవంతుని దయ, అనుగ్రహము మరియు పాఠకులైన మీ ఆశీర్వాదం ఉండడం వల్ల ధైర్యంగా ముందుకు వెళ్లి 'విధి రాత' విషయాన్ని వ్రాయడం జరిగినది. విధి ఆడించిన ఒక కుటుంబం గురించి కాస్త తెలుసుకుందాము.

హైదరాబాద్ నగరం లుంబిని పార్కులో పేలుడు జరిగిన తర్వాత వెంకటేశ్వర్ (అసలు పేరు కాదు) మరియు వీరి కుటుంబ సభ్యులు ఆ పేలుడు నుంచి తప్పించుకున్నారు. లుంబిని పార్కులో పేలుడు జరిగిన తక్షణం వీరు లుంబిని పార్కు నుంచి బయటకు వచ్చేశారు. ఈ విషయాన్ని టి.వి. చానెల్స్ వారు కవర్ చేస్తున్నారు. ఈ కార్యక్రమమును వెంకటేశ్వర్ గృహములో మిగిలిన కుటుంబ సభ్యులు చూసి ఒక క్షణం ఆలస్యం చేయక భయముతో కంగారుతో వెంకటేశ్వర్‌కు ఫోన్ చేశారు. సెల్ ఫోన్ ఎత్తిన వెంకటేశ్వర్ తను మరియు మిగిలిన కుటుంబ సభ్యులు క్షేమంగా ఉన్నామని, ఏ మాత్రం కంగారు పడవద్దని తెలపడంతో గృహము యందలి వారు ఊపిరి పీల్చుకున్నారు. తక్షణమే ఇంటికి వచ్చేయమని, ఎక్కడా తిరుగవద్దని, లుంబిని పార్కులో అసలుకే ఉండవద్దని హుకుం జారీ చేశారు. వెంటనే వస్తున్నామని తెలిపి ఫోన్ పెట్టేశాడు.

ఇంటికి వెళ్తూ వెళ్తూ గోకుల్ చాట్ సెంటర్‌లో పానీపూరీ ఇత్యాది ఆహార పదార్థాలను తిందామని చాట్ సెంటర్‌కు వెళ్లారు. అక్కడ బాంబు పేలడంతో కుటుంబ సభ్యులతో సహా తుది శ్వాస వదిలారు.

చూశారా! ఒక వ్యక్తి ప్రాణాలు తీయాలంటే విధి ఏ ఆలోచననైనా సాగిస్తుంది. ఎంతకైనా తెగిస్తుంది. ఒక్కసారి విధికి అప్పజెప్పిన పని జరుగక పోవడం అనునది ఉండదు.

ప్రజల మధ్యలో ఉండే అనుబందాలు, ప్రేమలు, ఆప్యాయతలు, తీవ్రవాదులకు ఎలా తెలుస్తాయి. విధి తీవ్రవాదుల రూపంలో ప్రాణాలను తీయడం జరిగినది.

విధి చేతిలో వంచితులైన ఓ గొప్ప సంపన్న న్యాయవాది కుటుంబం గురించి తెలుసుకుందాము. న్యాయవాది ఎవరు, ఏ ఊరు అను విషయం ప్రక్కన బెడితే అసలు విషయాన్ని తెలుసుకుందాము.

తమిళనాడులోని ఓ పట్టణంలో ఓ పేరు మోసిన న్యాయవాది జీవించే వాడు. వీరి గృహములో ఫక్తు వాస్తు దోషము కలదు. ఓ ప్రముఖ వాస్తు శాస్త్రవేత్త వీరి గృహమునకు పెళ్లికి పిలవడానికి వెళ్లి ఉన్న దోషములను తెలపడంతో న్యాయవాది ఆయనపై విసుక్కున్నాడు. చేసేది లేక ఆ వాస్తు శాస్త్రవేత్త అటు నుంచి వెళ్లి పోయారు. కాలక్రమంలో రెండు సంవత్సరాలు గడిచిపోయింది. న్యాయవాదికి ఆక్సిడెంటులో కాలు విరిగినది. భారీ నష్టం.

తర్వాత రెండు సంవత్సరాలలోపే అకస్మాత్తుగా కూతురు కుప్పకూలింది. భయంకరమైన జబ్బుతో

బాధ పడటంతో హుటాహుటిన ఓ పట్టణానికి తీసుకెళ్లడంతో అనారోగ్యమును బాగు చేయడానికి నమ్మండి నమ్మక పోండి! 70 లక్షల రూపాయలు ఖర్చు అయినదని తెలిసినది. ఎంతమాత్రం నిజమో తెలియదు. ఒక ఇంజక్షన్ ఖర్చు 6 లక్షల రూపాయలట. అలా 15 రోజులు ట్రీట్‌మెంట్లు జరిగాయి. భారీ ఆర్థిక నష్టం.

మహా మేధావి అయిన న్యాయవాది కోలుకోవడానికి సంవత్సరాలు పట్టింది. దురదృష్ట విషయమేమిటంటే ఆయన వాస్తును నేటికీ పరిగణనలోకి తీసుకోలేదు. ఇదియే విధి నాటకం. నిదానంగా ఆలోచన చేయండి. శ్రద్ధగా విధి యొక్క ఆలోచనను గమనించండి. తెలివైన వారికి భవిష్యత్తులో ఆ న్యాయవాది పరిస్థితి ఏమిటనేది తెలిసిపోయి ఉంటుంది. కారణం విధి యొక్క శక్తి, తెలివి తేటలు.

మొదట్లో కంప్యూటర్ వచ్చినప్పుడు అందులో లెక్కలు కట్టడానికి బాగా ఉపయోగకరంగా ఉండేది. అయితే బాగా కంప్యూటర్ పరిజ్ఞానం కలవారికి మాత్రమే కంప్యూటర్ ఉపయోగం తెలిసేది. మరి నేటి పరిస్థితి......

మనం మొదదులోని ఆలోచనలను సైతం కంప్యూటర్ తెలుసు కుంటున్నది అంటే ఆశ్చర్యపోవాల్సిన అవసరం లేదు. మేధస్సు ఎక్కడ నుంచి వచ్చినది. మానవ బుద్ధికి అంతమెక్కడ. ఇలా మానవుడు ఎన్ని తెలివైన విషయాలను కనుక్కొన్ననూ విధి గడ్డిపోచకు ఇచ్చే విలువ కూడా ఇవ్వదు. ఎందుకంటే మానవుని తెలివి నీటి బొట్టు, విధి తెలివి ఫసిపిక్ మహా సముద్రమంత. సముద్రాన్ని మానవుడు ఎప్పటికి కనుక్కోగలడు. ఎన్ని నీటి బొట్లను కలిపితే ప్రపంచంలోని అతిపెద్దదైన ఫసిపిక్ మహాసముద్రమును కొలవగలడు. భవిష్యత్తులో ఇది సాధ్యమయ్యే పనే కాదు. ఈనాటికి కాదు ఏనాటికి కూడా విధి యొక్క శక్తిని మానవుడు ఎదుర్కోలేడు. అనన్య సామాన్యమైన తెలివి తేటలు, ధైర్యము, సమయానికి స్ఫురించే ఆలోచనలు, కర్కసత్వం, పాషాణ హృదయం, విధి యొక్క ఆస్థులు.

హస్త సాముద్రికములో దిట్ట నేటికీ ఆయనను మించిన వాడు లేడు. ఆయన పేరే కీన్స్, మహామేధావి. రాజులు, చక్రవర్తులు, అత్యంత ధనవంతులు, ఈయనచే తమ భవిష్యత్తును తెలుసుకునే వారు. ఒకానొకనాడు. ఒక చక్రవర్తి తన జాతకమును చూపించుకోవడానికి కీన్స్‌ను పిలిపించుకొనెను. చక్రవర్తి హస్తమును చూపిన కీన్స్ ఫలానా సమయంలో నీకు మరణం తప్పదని తెలియజేసెను. మరణం ఏ రూపంలో వస్తుందని చక్రవర్తి అడిగిన ప్రశ్నకు విధి ఏ రూపంలోనైనా దెబ్బ తీస్తుందని తెలిపెను.

కీన్స్ చెప్పిన సమయం ఆసన్నమైంది. చక్రవర్తి ఒక హుకుం జారీ చేశాడు. తన భవంతికి చుట్టూ మెరికల్‌లాంటి సైనికులను కాపలాపెట్టాడు. ప్రతి ఒక్క విషయంలోనూ పూర్తి జాగ్రత్తలు తీసుకోవాలని ఆదేశించాడు. తను తీసుకునే ఆహార విషయంలో అత్యంత సూక్ష్మమైన భద్రతా ఏర్పాట్లను కావించాడు. తను ఆహారం తీసుకునే ముందే నలుగురిచే ఆ ఆహారమును తినిపించి ప్రమాదం లేదని తెలిసిన తర్వాత ఆ ఆహారమును భుజించేవాడు. క్షణాలు గడుస్తూనే ఉన్నాయి.

ఒక పిట్ట అరుపు వినిపించింది. టపటపమంటూ గాలికి దాని రెక్కలు కొట్టుకునే శబ్దం కూడా చక్రవర్తికి వినిపిస్తున్నాయి. క్షణాలు గడిచేలోపే ఆ పిట్ట లోనకు వచ్చింది. ఇంకేం మృత్యువు వచ్చినంత భయపడి పోయిన ఆ చక్రవర్తి తక్షణమే సైనికులను పిలిపించి ఆ పిట్టను భవంతి నుంచి బయటకు తరిమేశారు. మృత్యువు పిట్ట రూపంలోనైనా వస్తుందేమోనని తలచి వెంటనే పిట్టలు కూడా దూరకుండా తగిన జాగ్రత్తలు తీసుకున్నారు.

బాబోయ్! ఒకవేళ పాము వస్తే..... వచ్చే అవకాశమే లేదే. ఏమో ఎవరికి తెలుస్తుంది. ఆదేశాలు జారీ అయ్యాయి. యుద్ధ ప్రాతిపదికన పాము దూరలేనంతటి కంతలను కూడా పూడ్చి వేశారు. చీమల వల్ల ప్రాణం పోతుందేమోనని తలచి చీమల బొరియలను కూడా వెతికారని ప్రజలు చెప్పుకుంటారు. పడుకునే పరుపులో

ఏమైనా ఉండచ్చుని ఆ పరుపుపై నలుగురు సైనికులను పడుకోబెటట్టి అటూ ఇటూ పొర్లింప చేశారు. ఏ ప్రమాదమూ లేదు. మేధావులతో చర్చించి ప్రాణ గండం ఎక్కడి నుంచి వచ్చే అవకాశము ఉంటుందో అన్నీ విషయాలలోనూ జాగ్రత్తలు తీసుకున్నారు. ఒకవేళ కాలకృత్యాలు తీర్చుకునే సమయంలో జారీ పడి చనిపోతే...... ఇంకేం తక్షణమే జారకుండా ఉండటానికి బాత్‌రూమ్‌లో జాగ్రత్తలు తీసుకున్నారు.

ప్రాణ గండ సమయం దగ్గరకు వచ్చింది. క్షణాలను కూడా లెక్క పెట్టడం జరుగుతూ వుంది. ఎటు చూసినా ఉత్కంఠ. పట్టణంలో ఎక్కడ చూసినా ఒకటే చర్చ. రేపటి ఉదయం చక్రవర్తి ఉంటాడా పోతాడా.

తను తీసుకున్న జాగ్రత్తల వల్ల చక్రవర్తికి ధైర్యంగానే ఉంది. కానీ లోపల మాత్రం ఎక్కడో ఓ అనుమానం. ఏమైనా పొరపాట్లు జరిగాయా? మరణం సమీపిస్తుందా. కీన్స్ చెప్పినది జరుగుతుందా? అతను ఏమైనా నన్ను ఉత్కంఠకు గురి చేయడానికి ఇలా మభ్య పెట్టాడా? ఒకవేళ ఈ రోజు మరణం రాకపోతే రేపటి దినం కీన్స్‌ను బంధించి అవయవానికి ఓ ముక్కను ఖండించి, ప్రాణం ఉండగనే అతని కళ్ల ముందే అతని అవయవాలనే కాకులకు, గ్రద్దలకు వేయాలి. శరీర భాగం నుంచి అవయవాన్ని తొలగించిన తర్వాత అక్కడ గొడ్డు కారాన్ని దట్టించి లోపలికి తొక్కించాలి. ఒక ప్రక్క క్రోదం.

అన్నింటికన్నా ముఖ్యంగా క్షణక్షణం ప్రాణభయం. ఏమవుతుందో ఏమో. ఏమిటి ఈ నరకం. అనవసరంగా కీన్స్‌గాడి చేతిలో జాతకం చూపించుకున్నానే, జాతకం చూపించుకోకపోయి ఉండింటే ఈ నరకయాతన ఉండేది కాదుకదా! ఒక ప్రక్క ఆలోచనలు ఇంకోప్రక్క నరకాన్ని చూపుతున్న భారంగా కదులుతున్న సమయం. ఎందుకు సమయం త్వరగా గడవడం లేదు. ఎప్పుడు తెల్లవారుతుంది... ఇవే ఆలోచనలు. విధి పాచిక విసిరింది.

పైనున్న షాండ్లియర్ (గాజు దీపాల గుత్తి) కూలి చక్రవర్తి చచ్చాడు.

## పరిసరాల వాస్తు

వాస్తు అను పేరును మీరు ఎన్నో సార్లు విని ఉంటారు. వాస్తు పేరును వినినంతగా "పరిసర వాస్తు" అను పేరును విన్నారా? గోవా రాష్ట్రము యందలి మడ్గాన్ అను పట్టణంలో మల్లికార్జున పైప్స్ ఇండ్రస్టీ ఛైర్మెన్ అన్వేకర్ గారి గృహమును పరిశీలించు సమయంలో వీరి పక్కింటి గృహ యజమాని వచ్చి ఉండెను. కొంకిణి బాషలో నేను ఎవరని అడిగెను. అన్వేకర్ గారు వాస్తు సిద్ధాంతి అని తెలిపెను. ఆయన వెంటనే హోయ్ వాస్తు.. హవ్ ఆర్ యు అనెను. చివరకు నేను నా పేరు వాస్తు కాదు, నా పేరు సురేష్ అని తెలిపాను. మరి ఇంతకు మునుపు అన్వేకర్ గారు మీ పేరును వాస్తు అని తెలిపారే అని అడిగారు. ఆయన ముందే నవ్వితే ఏమవుతుందోనని నవ్వును బిగబట్టుకొని బయటకు వెళ్లి పక పకా నవ్వాను. ఆయన ఇంత వరకు వాస్తు అనే పేరే వినలేదట. వాస్తు పేరుతో ఒక శాస్త్రము ఉందనే విషయం అసలుకే తెలియదట. అంతెందుకు మన పక్క రాష్ట్రమైన కర్నాటకలోనే లోతట్టు ప్రాంతాలు అనగా అరేబియా సముద్రం ప్రక్క గల ప్రాంతాల వారికి వాస్తు అంటేనే తెలియదు.

ఒక రకంగా చెప్పాలంటే దక్షిణ భారతదేశంలోనే వాస్తు శాస్త్రమును సమాజంలోకి మన తెలుగు ప్రజలే బాగా ప్రాకించారని నా అభిప్రాయం. ఏది ఏమైనా మన రాష్ట్ర ప్రజలకు వాస్తు శాస్త్రంపై అవగాహన బాగా ఉంది. నా అభిప్రాయం ఏమంటే మన రాష్ట్రంలో వాస్తు అనే పేరు వినని వారు ఉండరని అనుకుంటాను. ఇంతలా మన రాష్ట్రంలో వాస్తు ప్రాకిననూ ఇంకా ఎంతో మందికి పరిసర వాస్తు అంటే తెలియకపోవచ్చు. కారణం దీనిపై అవగాహన సరిగా లేకపోవడమే.

"పరిసర వాస్తు" అనునది ఉన్నదా? ఒక్క మాటలో దీనికి సమాధానం ఏమంటే "వాస్తు" అనునది ఉన్నట్లు అయితే "పరిసర వాస్తు" కూడా ఉన్నట్లే. నీడ ఊరకే పడదు. మనిషి లేదా ఏదైనా ఒక వస్తువు ఉన్నప్పుడు మాత్రమే నీడ పడుతుంది. అలాగే "పరిసర వాస్తు" కూడా ఖచ్చితంగా ఉంది. వెలుతురు మనిషిపై పడినప్పుడు తప్పనిసరిగా వెనుక భాగంలో నీడ పడడం జరుగుతుంది. అలాగే ఒక నిర్మాణము ఉన్నప్పుడు అందు వాస్తు ఎలా పని చేస్తుందో అలాగే నిర్మాణం బయట "పరిసర వాస్తు" కూడా పని చేస్తుంది. వాస్తుకు ఎంత శక్తి కలదో "పరిసర వాస్తు"కు కూడా అంతే శక్తి కలదు. అయితే ఒక్కోసారి "పరిసర వాస్తు" శక్తి కన్నా వాస్తు శక్తి చక్కగా పని చేస్తుంది. ఇంకోసారి వాస్తు శక్తి కన్నా "పరిసర వాస్తు" శక్తే అధికంగా పని చేస్తుంది. ఇవి ఎలా ఎలా పని చేస్తాయనే విషయం తెలుసుకుందాము.

"పరిసర వాస్తు"లో వివిధ శాఖలు కలవు.

1. వీధులు
2. వీధిపోట్లు
3. హెచ్చు, తగ్గులు
4. కొండ గుట్టలు
5. సరస్సులు, నదులు, గుంతలు
6. చెట్లు
7. ఇతరుల గృహాలు
8. మైదానాలు

ఈ పై చెప్పుకున్నవన్నియూ పరిసర వాస్తులో ఒక భాగము. మనం వీటి విషయాలను కూలంకషంగా తెలుసుకోవాలి. ఈ విషయాలను ఎప్పుడైతే తెలుసుకుంటామో అప్పుడు పరిసర వాస్తు ఊరించి అధికంగా తెలుసుకున్నట్లే. ముందుగా మనం పరిసర వాస్తు గురించి తెలుసుకుందాము. ఆ తర్వాత అందులో గల శాఖలు మరియు అందు ఉపశాఖలు తెలుసుకుందాము. ఉపశాఖలు అనగా ఇలాగ ఉంటాయి. ఉదాహరణకు వీధులు మరియు ఈ వీధులు ఏ ఏ భాగములలో అనగా ఏ దిక్కులలో ఉన్నప్పుడు వాటి ప్రభావములను, ఫలితాలను విశ్లేషించాలి.

వీధులు :-

1. ఈశాన్యము
2. తూర్పు
3. ఆగ్నేయము
4. దక్షిణము
5. నైఋతి
6. పశ్చిమము
7. వాయవ్యము
8. ఉత్తరము

ఈ పై వాటిని ఉపశాఖలుగా అనుకోవాలి. ఇలా "పరిసర వాస్తు"లో దాదాపుగా 72 విభాగాలుగా భావించాలి. మనకు తెలిసినవి ఇవే. మనకు తెలియకుండా ఉన్నవి ఇంకెన్ని "విధి" చేతిలో అస్త్రాలుగా

ఉన్నయో తెలియదు. "విధి"కి అపరమిత శక్తులు కలవు. వాటిలో కొన్నింటిని మాత్రం మనము చర్చిస్తున్నాము. మానవ ప్రయత్నంగా మన విశ్లేషణలను, పరిశోధనలను గావిద్దాము. భవిష్యత్తులో జరిగే పరిశోధనలలో ఇంకా ఎన్నో విషయాలు బయట పడవచ్చు. వాటి గురించి తర్వాత తెలుసుకుందాము.

"పరిసర వాస్తు"ను వాస్తు శాస్త్రంలోని అంతర్ భాగంగా కూడా చెప్పుకోవచ్చు. ఇలా కాకుండా మనిషికి కుడి, ఎడమ చేతులు ఎలా వున్నాయో అలాగే వాస్తు శాస్త్రమునకు "పరిసర వాస్తు" ఒక ముఖ్య అవయవంగా చెప్పుకోవచ్చు.

ఎంత గొప్ప మేధావి అయిన గృహస్థుడైనా ఎంతో ముందు జాగ్రత్తగా అనుభవజ్ఞుడైన వాస్తు సిద్ధాంతిని పిలిపించినా ఒక్కోసారి సరైన ఫలితాలు రావు. కారణం ఆ వాస్తు శాస్త్రవేత్త చెప్పినవి ఆచరించకపోవడమే.

గృహము యందు ఎటువంటి సమస్య ఉన్ననూ వాస్తు శాస్త్ర రీత్యా ఆ సమస్యను పరిష్కరించుకొనే సవరణను కావించుకోవడానికి అవకాశముంది. కానీ "పరిసర వాస్తు"లో అటువంటి సవరణ కావించాలంటే ఒక్కోసారి బహు కష్టమైన కార్యము. ఉదాహరణకు నైరుతిలో సరస్సు.

అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్తకు ఎన్నో విషయాలు తెలిసి వుంటాయి. ఆయన సవరణలను చెబుతున్నప్పుడు గృహస్థులు ఆ సవరణలను తప్పనిసరిగా వ్రాసుకోవడం వల్ల అనేక ప్రయోజనములు ఉంటాయి. అయితే చాలా మంది నేడు వాస్తు శాస్త్రవేత్తను గృహమునకు పిలిపించి ఆయనచే సవరణలను చెప్పించుకొని వ్రాసుకోరు. ఇది సరైన విధానం కాదు. ఒకటి లేదా రెండు సవరణలను వ్రాసినా లేక వ్రాయక పోయినా ఫర్వాలేదు. కానీ ఎక్కువ సవరణలు వచ్చినప్పుడు తప్పనిసరిగా వ్రాసుకోవడం మంచిది.

అలాగే గృహమునకు వాస్తు శాస్త్రవేత్త వచ్చినప్పుడు "పరిసర వాస్తు"పై తప్పనిసరిగా దృష్టి సారిస్తాడు. ఇంకా కొందరు తల పండిన మేధావులు అయితే "పరిసర వాస్తు"ను కూలంకషంగా పరిశీలన కావిస్తారు.

ఉదాహరణకు ఒక పెద్ద ఫ్యాక్టరీ ఉందనుకుందాము. సాధారణంగా ఫ్యాక్టరీలు ఊరి బయట ఉంటాయి. ఊరిలో ఉన్నప్పుడు వాస్తు ఓ విధంగా పని చేస్తుంది. ఊరి బయట ఉన్నప్పుడు వాస్తు ఇంకో విధంగా పని చేస్తుంది. అనగా వాస్తు మరియు పరిసర వాస్తు ఈ రెండు కలిసి పని చేస్తాయి.

ఒక వ్యక్తి సైకిల్‌పై వెళ్తూ ఉంటాడు. ఒక మిట్ట ప్రాంతం వస్తుంది. ఆ మిట్ట ప్రాంతమును దాటడానికి సైకిల్ త్రొక్కే వ్యక్తి ఎక్కువ శ్రమను పడవలసి వస్తుంది. ఇటువంటి పరిస్థితిలో ఇంకొకరు వచ్చి ఆ సైకిల్‌పై కూర్చుంటే సైకిల్ త్రొక్కే వ్యక్తి పరిస్థితి ఏమిటి. తన శక్తిని అంతటినీ దారబోసి సైకిల్ త్రొక్కినా అతి కష్టంగా ముందుకు వెళ్లవచ్చు లేదా ఉన్నచోట ఆగిపోవలసి రావచ్చు.

పరిసర వాస్తు కూడా అలాగే. వాస్తు దోషాలతోనే వేగలేకపోయే వారికి పరిసర వాస్తు కూడా తోడైతే వారి పరిస్థితి ఏమిటి. ఒకవేళ పరిసర వాస్తు బాగా ఉంటే అప్పటి పరిస్థితులు వేరుగా ఉంటాయి. అదే పరిసర వాస్తు సరిగా లేకపోతే అనగా అనుకూలంగా లేకపోతే పరిస్థితులు దారుణంగా వుంటాయి.

ఎంత చేసుకున్న వారికి అంత మహాదేవా! అను ఒక సామెత కలదు. అలాగే అదృష్టవంతులకు కూడా వారు ఉన్న నిర్మాణము సరిగా లేకపోయిననూ పరిసర వాస్తు ప్రభావము మంచిగా వుండి వారు అభివృద్ధిని అందుకోవచ్చును.

అదే దురదృష్టవంతుడు. నిర్మాణం యందలి వాస్తు సరిగా ఉన్నా పరిసర వాస్తు అనుకూలం లేకపోయి అభివృద్ధిని అందుకోలేక కుంటుపడి ఆగిపోవలసి రావచ్చు.

**దురదృష్టవంతుడుని ఎప్పటికీ పరిసర వాస్తు, వాస్తు వెంటాడుతూ వుంటాయి. అదే అదృష్టవంతుడికి ఈ పై రెండులో ఒకటి అనుకూలంగా ఉంటాయి.**

అవసరం కాబట్టి ఇక్కడ ఒక ప్రశ్నను మరియు సమాధానమును తెలుసుకోవాలి.

ఒక ప్రశ్న :- ఆర్యా! మా ఇంటి ప్రక్కన ఉన్న వారి పరిస్థితి రోజు రోజుకు అభివృద్ధిలోకి వస్తున్నది. వారు ఏమి ముట్టినా బంగారము అవుతున్నది. కానీ వారు ఉన్న ఇళ్లు వాస్తు రీత్యా ఏమీ బాగాలేదు. వీరికి ఆగ్నేయ ద్వారము, మరియు వీరి ప్రహారీలో ఈశాన్య భాగమున లెట్రీను కట్టి మూత బడి ఉన్నది. నైరుతిలో ట్యాప్ (కొళాయి) గుంత గలదు. వీరింట పడక గదులు కూడా నైరుతి భాగమున లేవు. నైరుతిలో వంట చేస్తుంటారు. ఈ ఇంటికి వీరు వచ్చి 4 సంవత్సరాలు అయినది. వచ్చినప్పటి నుంచి పరిస్థితులు ఉధృతంగా ఉన్నాయి. ఆశ్చర్యకరమైన విషయము ఏమిటంటే ఇంతకు మునుపు ఇదే ఇంటిలో ఉన్న రెండు మూడు కుటుంబాల వారు సర్వనాశనమైపోయారు. మరి వీరికెందుకు ఇంత బాగా జరుగుతున్నది. దీనిని బట్టి వాస్తుపై విశ్వాసం నశిస్తున్నది. వాస్తు అనునది పని చేస్తుందా లేదా దయచేసి మీరు సమాధానం చెప్పగలరు.

సమాధానము :- ఇక్కడ ఒక విషయమును గమనించాలి. 8 దిక్కుల ప్రభావమే వాస్తు. ఒకటి లేదా రెండు దిక్కులను చూసుకొని అనగా అక్కడి నిర్మాణములను గమనించి ఇదియే (ఇది ఏమి) వాస్తు అనుకోవడం తప్పు. అతి ముఖ్యమైన విషయము ఏమంటే మీరు వీరి ఇంటి పరిసర వాస్తు గురించి ఏమాత్రం తెలపలేదు.

*(దాదాపుగా మూడు నెలలు గడిచిన తర్వాత నేను వీరి పట్టణమునకు వెళ్లడం మరియు వీరు చెప్పిన గృహమును పరిశీలించడము జరిగినది. ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే వెంకటేశ్వర్ రావు గారు వివరించి చెప్పమన్న ఆ గృహము ప్రక్క అనగా దక్షిణ భాగంలో బ్రహ్మాండమైన అపార్టుమెంటు నిర్మించారు. ఈ అపార్ట్‌మెంట్ నిర్మించి 4 సంవత్సరాలు అవుతున్నది.)*

చూడండి ఒక మనిషికి భగవంతుడు ఇచ్చిన వరమా లేక ఏమనుకోవాలి. అంత వరకు వచ్చిన వారందరూ నాశనం కావడమేమిటి? 4 సంవత్సరాల నుంచి ఉన్న వారి పరిస్థితి ఉధృతంగా వెలిగిపోవడమేమిటి? ఇది వారి అదృష్టమనుకోవాలా? లేక ఏమనుకోవాలి?

వాస్తు ఎప్పటికీ పని చేస్తూనే ఉంటుంది. పరిశీలించే వారిలోనే అసలైనదంతా ఉంది. చిన్న పొరపాటు బడి పరిశీలన సరిగా చేయకపోతే ఇలాంటి అనుమానాలే ఎన్నో వస్తాయి. అంతేకానీ కొందరికి వాస్తు పని చేస్తుంది కొందరికి పని చేయదు అని అనుకోవడము పూర్తిగా అసంబద్ధము. నిర్మాణము ఉన్న తర్వాత అక్కడ వాస్తు తప్పనిసరిగా పని చేస్తుంది. అలాగే పరిసర వాస్తు కూడా.

సమయం (టైం) బాగా లేకపోతే వాస్తు "అగ్ని"లా రూపాంతరం చెందుతుంది. పరిసర వాస్తు "వాయువు"లా రూపమును మార్చుకుంటుంది.

అదే సమయం (టైం) బాగా ఉంటే వాస్తు "పాలు"లా రూపాంతరం చెందుతుంది. పరిసర వాస్తు "వర్షం"లా రూపమును మార్చుకుంటుంది. అనగా పాలవర్షం కురుస్తుంది. ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే అన్ని విషయాలలోనూ బ్రహ్మాండంగా ఉంటుంది.

మరి ఇలా అనుకునేటట్లు అయితే వాస్తును ఎందుకు చూసుకోవాలి? మన జాతకము ఒక్కటే చూసుకుంటే చాలు కదా! జాతకం మేరకు జరిగేటట్లు అయితే వాస్తును చూసుకోవలసిన అవసరం

ఎందుకు.

మీ అనుమానం అద్భుతం.

ఒక వ్యక్తికి కడుపులో బాగా నొప్పి వస్తున్నది. అతను డాక్టర్ దగ్గరకు వెళ్లాలా? లేదా జ్యోతిష్యం చెప్పే వారి దగ్గరకు వెళ్లాలా? ఏది కరెక్టు. డాక్టర్ దగ్గరకు వెళ్లాల్సిన అవసరం ఏముంది జ్యోతిష్కుడి దగ్గరకు వెళితే ఎప్పటి వరకు కడుపు నొప్పి ఉంటుందో చెబుతాడు కదా! ఏ గ్రహం వల్ల కడుపు నొప్పి వచ్చిందో కూడా తెలిపి ఆ గ్రహ శాంతి చేసి ఆ కడుపు నొప్పి నుంచి ఉపశమనం కలిగేలా చేస్తాడు కదా! ఇలా అనుకొని కడుపు నొప్పి వచ్చిన వ్యక్తి జ్యోతిష్కుడి దగ్గరకు వెళ్లడం జరుగుతుందా! ఎక్కడైనా ఇటువంటి కేసులు చూశారా! ఎవరో ఒకరు ఇద్దరు అజ్ఞానులు ఇలా ప్రవర్తించవచ్చేమో. ఇంతేకానీ అందరూ కడుపునొప్పి వచ్చిన వెంటనే జ్యోతిష్కుడి దగ్గరకు వెళ్లడం జరగదు. డాక్టర్ దగ్గరకే వెళతారు.

కడుపు నొప్పి అనగా పరిస్థితులు బాగోలేక పోవడముగా ఊహించుకోండి. డాక్టర్ అనగా వాస్తు అని ఊహించుకోండి.

పరిస్థితులు బాగలేకపోతే జాతకాన్ని నమ్ముకొని ఎంత కాలం అలాగే సమయాన్ని వెళ్లబుచ్చగలము. కడుపు నొప్పి వస్తే ఎలాగైతే డాక్టర్ దగ్గరకు వెళ్లి ఉపశమనం పొందుతామో పరిస్థితులు బాగలేకపోతే మంచి ఫలితాలను ఒసంగే అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్తను పిలిపించుకొని తగిన సవరణలను పొంది బాధలను తొలగించుకోవచ్చును.

జ్ఞానులు కష్టం వచ్చినప్పుడు వెంటనే ఏమి చేస్తే కష్టం తొలగి పోతుందో ఆలోచన చేసుకొని ఆ పని చేసి ఉపశమనం పొందుతారు. అదే మూర్ఖులైతే రకరకాల పనికి రాని ఆలోచనలను కావించి కాని పనులు చేసి ఉన్న సొమ్మంతయూ ఊడగొట్టుకుంటారు. సమాజంలో నేడు నిజాయితీగా బ్రతకాలంటే కష్టముగా ఉంది. మంచి వారు కూడా బ్రతుకు తెరువు కోసం కొన్ని కాని పనులను చేయవలసి వస్తున్నది.

సమాజంలో ఎందరో మోసగాళ్లు ఉన్నారు. వీరందరినీ ఎదుర్కొని మనం ముందుకు వెళ్లాల్సి ఉంటుంది. మన పరిస్థితులు బాగాలేవని ఇటువంటి మోసగాళ్ల దగ్గరకు వెళితే ఆ మాట ఈ మాట చెప్పి ఉన్నదంతయూ ఊడబెరుక్కొని కంటిలో నీరు తెప్పిస్తారు.

మీరు జ్ఞానవంతులు. అజ్ఞానులు చేసే పనులు చేయరు.

ఒకసారి నాగపూర్ దగ్గర ఓ ఫ్యాక్టరీని చూడటానికి వెళ్లడం జరిగినది. ఆ ఫ్యాక్టరీ బయట పరిసర వాస్తు ప్రభావమును గమనించడానికి ఫ్యాక్టరీ చుట్టూ తిరిగి మరియు కాస్త చుట్టు ప్రక్కల ప్రదేశాలు కూడా చూడడం జరిగింది. నా ఉద్దేశ్యము ఏమిటంటే ఆ ఫ్యాక్టరీకి పరిసర వాస్తు ప్రభావము ఎలా ఉందో పరిశీలన చేయాలని.

ఇది తెలియని ఫ్యాక్టరీ వారు ఫ్యాక్టరీ వాస్తు చూడమంటే ఫ్యాక్టరీ బయట ఎందుకు తిరుగుతున్నారని ప్రశ్నించారు. ఇందుకు సమాధానముగా పరిసర వాస్తు చూడటానికి నేను ఫ్యాక్టరీ చుట్టు ప్రక్కల చూసి వచ్చాను అని తెలిపితిని. వెంటనే వారు అయితే మీకు వాస్తు చూడటం రాదా? మీరు పరిసర వాస్తు చూసే వారు అయితే వాస్తు శాస్త్రవేత్తలని ఎందుకు తెలిపి మా ఫ్యాక్టరీ చూడటానికి వచ్చారు. ముందుగానే మీరు పరిసర వాస్తు శాస్త్రవేత్తలమని చెప్పాలి కదా! అలా చెప్పకుండా వాస్తు శాస్త్రవేత్తలమని చెప్పి మా ఫ్యాక్టరీకి ఎందుకు వచ్చారు అని వారు సంధించిన ప్రశ్నలతో నవ్వాలో లేక అక్కడ ఎక్కడైనా కూర్చోని ఏడవాలో కూడా తెలియలేదు. పరిసర వాస్తు అనేది ఇంకొక శాస్త్రము అని వారి భావన. వాస్తు మరియు పరిసర

వాస్తుకు ఏమాత్రం సంబంధం లేదని వారు భావించారు. మరియు నన్ను అనుమానంగా చూడటం మొదలు పెట్టారు. ఇంకేముంది నాపై ఉన్న విశ్వాసమంతా నశించింది.

వాస్తు మరియు పరిసర వాస్తు ఒక్కటేనని. వాస్తులోనే పరిసర వాస్తు ఒక భాగమని వారికి చెప్పి ఒప్పించడానికి దాదాపుగా 2 గంటల సమయం పట్టింది. అయినా వారికి ఉన్న చిన్నపాటి అనుమానం సైతం తొలగించాలని భావించి మన ఆంధ్రాలోనే గల ఓ మోస్తరు పేరు గల ఓ వాస్తు సిద్ధాంతికి ఫోన్ చేసి ఫోన్ యందు గల స్పీకర్ ఆన్ చేసి విషయమంతయూ వారికి వివరించడము జరిగినది. టైం బాగుంది ఆ వాస్తు శాస్త్రవేత్త పరిసర వాస్తును ఎవరైతే గమనిస్తున్నారో వారు అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్తలని వాస్తులోనే పరిసర వాస్తు కూడా ఒక భాగమని మీరు ఎన్నుకున్న వాస్తు శాస్త్రవేత్త చక్కటి దారిలోనే ఉన్నారని వారికి నిజం చెప్పారు. ఎలాగైతేనేం చివరికి వారు పరిసర వాస్తు అనునది వాస్తులో ఒక భాగమని తలిచారు. అంతటితో నాపై ఉన్న అనుమానాలు తొలగిపోయాయి. నేను చెప్పిన సరవణలకు విలువను ఇచ్చారు.

పరిసర వాస్తు మరియు వాస్తు అనునది వేరు వేరు అని కొందరు తలుస్తారు. వాస్తు మరియు పరిసర వాస్తు అంతా ఒక్కటే. వాస్తులోని అంతర్ భాగమే పరిసర వాస్తు. పరిసర వాస్తులోని అంతర్ భాగమే వాస్తు. అనగా వాస్తు మరియు పరిసర వాస్తులను భార్యాభర్తలుగా చెప్పుకోవచ్చును. విడదీయరాని బంధం ఈ రెండింటిది.

ఒకవేళ మీరు ఎప్పుడైనా అవసరం ఏర్పడి ఓ వాస్తు శాస్త్రవేత్తను పిలిపించుకుంటే ఆయన పరిసర వాస్తును శ్రద్ధగా గమనిస్తూ ఉంటే ఆయనను అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్తగా అని కూడా అనుకోవచ్చు. సాధారణంగా అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్త ఒక నిర్మాణంపై గల "పరిసర వాస్తు" ప్రభావమును ఎక్కువగా గమనిస్తాడు. అంతేకానీ నేను పరిసర వాస్తు ప్రభావమును గమనిస్తున్నాను చూడండహో అంటూ డప్పు కొట్టుకోడు. ఒకేఒక క్షణంలోనే పరిశీలించడానికి వచ్చిన ఒక నిర్మాణము యొక్క చుట్టు ప్రక్కల గల పరిసర వాస్తు ప్రభావమును గమనిస్తాడు. అది అతని టాలెంట్.

నా చిన్నతనంలో అనారోగ్యం వచ్చినప్పుడు ఓ డాక్టర్ దగ్గరకు వెళ్లే వాడిని ఆయన సూది మందు (ఇంజెక్షన్) వేసే విధానము ఇప్పటికీ నాకు ఆశ్చర్యకరమే. ఆయన సూది గుచ్చినదీ తెలియదు, ఎప్పుడు మందు ఎక్కించాడో కూడా తెలియదు, ఎప్పుడు సూది బయటకు తీశాడో కూడా తెలియదు. అది ఆయన సమర్థత, ఆయన అనుభవము.

ఇంకొందరు డాక్టర్లు ఉంటారు సూది మందు వేసి దానికి వేళబడుతూ వుంటారు. ఒక్కోసారి మందును కాకుండా సూదిని కూడా శరీరంలోకి ఎక్కిస్తారు. అసలు రోగం కన్నా వీరు పొడిచిన పోడుపు బాధను తొలగించుకోవడానికి  ఇంకొక ఆస్పత్రిలో చేరాల్సిన పరిస్థితులు రావచ్చు. ఇంకొందరు డాక్టర్లు సూది వేసిన విషయం తెలుసుకోవాలనో కాబోలు సూది మందు వేసిన ప్రాంతంలో గోలికాయంత సైజు దద్దుర కట్టి ఉంటుంది.

ఏ విషయంలోనైనా అనుభవజ్ఞుల దగ్గరకు వెళ్లడమే ఉత్తమము. ఇదియే ఎప్పటికీ సరైన విధానము. ఆరోగ్యాల దగ్గర, వాస్తు దగ్గర డబ్బుకు కక్కుర్తి పడటం ఎప్పటికీ తప్పనే నా భావన.

ఊరిలో పరిసర వాస్తు ప్రభావము వేరుగా ఉంటుంది. ఊరి బయట పరిసర వాస్తు ప్రభావము ఇంకోలా ఉంటుంది. ఊరి బయట పరిసర వాస్తుకు అధిక ప్రాధాన్యతను ఇవ్వవలసి వుంటుంది. అలాగని

ఊరిలో ఉన్న నిర్మాణమునకు పరిసర వాస్తు ప్రభావము తక్కువుగా ఉంటుందని నా అభిప్రాయం కాదు. ఏది ఏమైననూ ఊరి బయటి నిర్మాణంపై పరిసర వాస్తు ప్రభావం ఎప్పటికీ అధికంగానే ఉంటుంది. ఇది సత్యము.

ఊరి బయట నిర్మాణం సాగిస్తే పరిసర వాస్తు యొక్క ప్రభావమును చాలా జాగ్రత్తగా గమనించుకోవాలి. దీనిపై ఎక్కువ శ్రద్ధను వహించవలసి వుంది. పరిసర వాస్తును ఎవరైతే శ్రద్ధగా గమనించి తగిన (సరైన) అంచనాకు వస్తారో వారు మంచి అనుభవం గల వాస్తు శాస్త్రవేత్తగా చెప్పుకోవచ్చు.

ఒక అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్త ఒక నిర్మాణమునకు వచ్చినప్పుడు దాదాపుగా వంద విషయాలను దృష్టిలో ఉంచుకుంటాడు. మనము ఇంతకు ముందు చెప్పుకున్నట్లుగా 72 విభాగాలను మరియు అలాగే గృహము లోపల కూడా కల అనేక విభాగాలను దృష్టిలో ఉంచుకుంటాడు. దాదాపుగా ఈ విభాగాలన్నియూ కలిసి వంద సంఖ్యను దాటగలవు. ఇంకొందరు అనుభవజ్ఞులైన వాస్తు శాస్త్రవేత్తలు ఒక నిర్మాణమునకు వచ్చినప్పుడు 60 క్షణాలలో అనగా ఒక్క నిమిషంలో దోషాలు ఏమిటో కనుక్కోగలరు మరియు ఆ నిర్మాణము యందు గల వాస్తు పరిస్థితులను తెలుకోగలరు. ఇదంతయూ వారు పూర్వంలో పడిన కష్టము మరియు భగవంతుడి కృప. గృహస్థుడు అదృష్టవంతుడు అయితే తప్పకుండా పైసలకు కక్కుర్తి పడక అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్తను ఆహ్వానిస్తాడు. గృహస్థుడు దరిద్ర్యుడు అయితే పైసలకు కక్కుర్తి పడి అనుభవం లేని వారిని పిలిపించుకుంటారు. మీరు అదృష్టవంతులు కాబట్టి ఏ సమస్యా లేదు.

**పరిసర వాస్తు అంటే**

**ఒక నిర్మాణము బయట గల వాస్తు ప్రభావమును పరిసర వాస్తు అంటారు.**

అంతేకానీ పరిసర వాస్తు అనునది ఇంకొక శాస్త్రం కాదు. ఇది వాస్తు శాస్త్రములోనే ఒక భాగము.

వాస్తులో పరిసరాల వాస్తుకు అత్యంత ప్రాధాన్యత ఉంది. ఒక్కోసారి గృహము వాస్తురీత్యా నిర్మించుకున్నను, పరిసరాల వాస్తు సరైనదిగా లేనట్లయితే ఆ గృహమునందలి నివసించువారు ఉత్తమ ఫలితాలు పొందడం కష్టము. ఈ పరిసరాలవాస్తును ఎంతో అనుభవజ్ఞుడైన వాస్తు సిద్ధాంతి మాత్రం చక్కగా తెలుపగలడు. నా అనుభవములో పరిసరాల వాస్తు సరిగా లేకుండా గృహము మాత్రము వాస్తురీత్యా నిర్మించుకున్ననూ గృహముల యందలి యజమానులు కాస్త దెబ్బతినడం గమనించడమైనది.

పరిసరాల వాస్తు అంటే ఏమిటి ? మన ఇంటి ప్రహారీ తరువాత బయట స్థలముపై ఉన్న శుభ, అశుభ వాస్తు ప్రభావములను పరిసరాల వాస్తు అంటారు. ఒక్క మాటగా చెప్పాలంటే ప్రతి స్థలముపై వాస్తు ప్రభావము ఉంటుంది. దానిని ఆనుకున్న గృహాలపై ఆ ప్రభావము తప్పనిసరిగా ఉంటుంది. ఒకవేళ పరిసరాల వాస్తు అశుభకరంగా ఉన్నప్పుడు మన గృహముయందలి వాస్తు సరిగా లేకపోయినట్లయితే పది సంవత్సరాలలో ఏర్పడే నష్టము ఒక్క సంవత్సరములోనే ఏర్పడుతుంది. అదే పరిసరాల వాస్తు సరిగా లేకుండా మన గృహము మాత్రము వాస్తురీత్యా నిర్మించు కున్నట్లయితే జరుగబోయే నష్టాన్ని ఎంతో ఎక్కువ కాలంపాటు ఆపేశక్తి ఉంటుంది. ఒకవేళ మన గృహమునకు మంచి వాస్తు పట్టు ఉన్నట్లయితే పరిసరాల వాస్తు సరిగా లేకపోయినా నష్టాలను ఆపుతూ లాభాల దిశగా మన గృహము ముందుకు సాగే అవకాశం ఎక్కువ. ఈ విషయంగా ఇంకా విపులంగా సంపూర్ణంగా సంభాషించుకుందాము. పరిసరాల వాస్తు గురించి తెలుసుకొనే ముందుగా పంచభూతాల గురించి తెలుసుకోవలసి ఉంటుంది. ఈ పంచ భూతాల సమపాళ్ళ

సాన్నిహిత్య రూపమే వాస్తు మరియు పరిసర వాస్తు. అంతటి గొప్ప ప్రాధాన్యతను పంచభూతాలు వాస్తు విషయంలో ఆక్రమించాయి. పంచభూతాల సమపాళ్ళ నిర్మాణం లేనిదే వాస్తు, పరిసరవాస్తు లేదు. అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్త ఒక గృహమును మరియు గృహ పరిసరాలను గమనించగానే ఆ ఇంటివారి జాతకాన్ని చెప్పే పరిజ్ఞానాన్ని కలిగిఉంటాడు. భవిష్యత్తులో ఆ ఇంటి వారికి జరుగబోయే పరిణామాలను కూడా చెప్పగలిగే పరిజ్ఞానాన్ని కలిగిఉంటాడు. పరిసర వాస్తు సరిగా ఉండి గృహ వాస్తు కూడా సరిగా ఉంటే వారికి పట్టిందల్లా బంగారమే. గృహస్తులు ఈ విషయంగా ఒకసారి బాగా ఆలోచించుకుని మంచి పరిజ్ఞానము కలిగిన వాస్తు సిద్ధాంతిద్వారా మీ గృహమును పరిశీలింప జేయించుకుంటే అన్ని విధాలా గృహస్థులు సంతోషంగానూ, మంచి అభివృద్ధిని, ఆనందాన్ని పొందగలరు. మీ పిల్లలు మంచి అభివృద్ధిలోకి రాగలరు. అందుకే మంచి పరిజ్ఞానము గల వాస్తు సిద్ధాంతి ముందుగా గృహమునకు వచ్చినప్పుడు తన పరిశీలనలో ముఖ్య భాగంగా పరిసర వాస్తును గమనించడం జరుగుతుంది. చాలామంది వాస్తు శాస్త్రజ్ఞులు గృహ పరిసర వాస్తును గమనించకనే ఇంటి వాస్తును చెప్పడం జరుగుతున్నది. ఇది పూర్తిగా తప్పు. అందువల్లనే రాత్రిళ్ళు వాస్తు చూడకూడదని పెద్దల ఉవాచ. రాత్రిళ్ళు పరిసరాలు వెలుగులేని కారణంగా సరిగా కనిపించవు. కావున ఎన్నో పొరపాట్లు జరిగే అవకాశం ఉంటుంది. అందువల్లనే రాత్రిళ్ళు వాస్తు చూడరాదని కట్టడి చేశారు. ఈ మాట చెప్పితే వినరని, ఓ నమ్మకము మరియు మూఢనమ్మకము కింద రాత్రిళ్ళు వాస్తు చూడరాదనే నిబంధనను ఏర్పరచారు. అందుకే పెద్దల మాట చద్దన్నం మూట అంటారు.

పరిసరవాస్తు గురించి నాకు జరిగిన ఒక అనుభవాన్ని చెప్తాను. మధ్యప్రదేశ్ రాజధాని అయిన భోపాల్ నందు ఒక గృహాన్ని పరిశీలించడం జరిగింది. పెద్దగా వాస్తు బలం ఆ ఇంటికి లేదు. అయితే బృహత్తరంగా ఆ ఇంటి వారు అభివృద్ధి చెందడం జరుగుతున్నది. రాత్రిళ్ళు చూడడం వద్దన్ననూ ఆ ఇంటి బావమరిది నన్ను బలవంతంగా చూడాలని పిలుచుకు వెళ్ళినందువల్ల తప్పనిసరై చూడడం జరిగింది. ఇల్లు పశ్చిమ సింహద్వారం, ఉధృతంగా ఉన్న వారి అభివృద్ధిని చూశాను. ఇంటిని గమనించడం జరిగింది. పరిసరవాస్తు రాత్రిళ్ళు కారణంగా గమనించడానికి వీలులేక పోయింది. ఇక రాత్రంతా సరిగా నిద్రలేదు. ఏ కారణం చేత ఆ ఇంటికి అంత ధనం వస్తోంది. పిల్లలు అంత అభివృద్ధి సాధిస్తున్నారు. కలత నిద్రతో రాత్రి గడిపేశాను. తెల్లవారు ఝామునే ఐదింటికే నిద్ర లేచి నా క్లయింట్ అయిన బావమరిది ఇంటికెళ్ళి, నిద్రలేపి మీ బావ గారింటికి వెళదామని తెలిపినాను. అతను నోరెళ్ళబెట్టుకొని ఆశ్చర్యంగా చూడసాగాడు. ఇంత తెల్లవారు ఝామునే అంత అవసరంగా చూడవలసిన అవసరం ఎందుకు అని అడగడం జరిగింది. గృహాన్ని ఇంకొకసారి గమనించాలని తెలిపినాను. పరిసరవాస్తు గురించి అతని వద్ద ప్రస్తావించలేదు. కారణం చాలామందికి పరిసర వాస్తు తెలియక పోవడమే. కాఫీ కార్యక్రమం అయ్యాక ఆదరా బాదరా వారి బావగారింటికి వెళ్ళడం జరిగింది. వెళ్ళడం వెళ్ళడం కారణాన్ని వెతకసాగాను. తప్పనిసరిగా ఈ ఇంటికి ఈశాన్యం శుభకరంగా ఉండాలి. వెంటనే ఇంటి వెనుక భాగానికి వెళ్ళి గమనించాను మరియు మేడపైకి వెళ్ళాను. ఇంకేముంది ఆశ్చర్యకరంగా ఆ ఇంటికి ఈశాన్య వీధిపోటు ఉన్నది. అంతటితో రాత్రంతా బడిన బాధ, బడలిక, వేదనతీరి ఆనందం ఆక్రమించింది. అందుకే రాత్రిళ్ళు వాస్తు చూడరాదని ఋషులు శాస్త్రములలో వక్కాణించారు. పూర్వ కాలంలో ఇప్పటిలా కరెంటు లేదు, ఇలా కరెంటు ఉండి ఉంటే ఈ మాట అనే వారు కాదేమో.

## వీధులు

వీధులు ఎనిమిది రకాలు. అందులో మొదటిది ఈశాన్య వీధిగా చెప్పుకున్నాము. ముందుగా మనము వీధులను రెండు భాగాలుగా అనుకుందాము. మొదటి భాగంలో మూలలలో వచ్చే వీధులు, రెండవ భాగంలో దిక్కులలో వచ్చే వీధులుగా విభజించుకుందాము.

మొదటి భాగంలో :-

1. ఈశాన్య వీధి,
2. ఆగ్నేయ వీధి,
3. నైరుతి వీధి,
4. వాయవ్య వీధి.

రెండవ భాగంలో :-

1. తూర్పు వీధి,
2. దక్షిణ వీధి,
3. పశ్చిమ వీధి,
4. ఉత్తర వీధి.

ముందుగా మనం ఈశాన్య వీధి గురించి తెలుసుకుందాము. దీనికి ముందు ఈ క్రాస్ వీధుల గురించి కొద్దిగా తెలుసుకోవడం మంచిది. రోడ్డు వేయునప్పుడే జాగ్రత్తలు తీసుకోనిచో ఇలా క్రాస్ వీధులు ఏర్పడడము సహజం. దిక్సూచి అనుగుణంగా రహదారులను ఏర్పాటు చేసుకున్నట్లు అయితే వీధులు చక్కగా ఏర్పడును. 90 డిగ్రీలకు అనుకూలంగా ఉండును. అలా కాకుండా స్థలానికి అనుగుణంగా రహదారులను వేసుకుంటూ వెళ్తే అందు వున్న గృహములకు విదిక్కులు ఏర్పడడం సహజం. విదిక్కులలో నిర్మాణాలు అతి కష్టమైనవి. ఎంతో మేధావి అయిన వాస్తు శాస్త్రవేత్త మాత్రమే విదిక్కులలో గృహ నిర్మాణానికి తగిన ప్లాను ఇవ్వగలడు. సాధారణంగానే దిక్కులకు సరిగా ఉన్న గృహములకే గృహ ప్లాన్లు ఇవ్వడం కాస్తంటే కాస్త ఇబ్బందనే చెప్పుకోవాలి. అలాంటిది విదిక్కులలో గృహ ప్లానులను ఇవ్వడమనేది అత్యంత జాగ్రత్తగా చేయవలసిన కార్యక్రమము. సాధారణ జనులకు విదిక్కులలో గృహ ప్లానును ఇవ్వడమంటే ఆశామాషీ వ్యవహారం కాదు. ఇప్పుడు మనం ఈశాన్య వీధి గురించి తెలుసుకుందాము.

**1. ఈశాన్య వీధి :-** ఈశాన్య వీధి అనగా గృహమునకు ఈశాన్య భాగములో వీధి ఉండడం. ఉదాహరణకు ఇలాగా.



ఈ పై పటములో గృహము సంగతి ఎలా ఉన్నా వీధి మాత్రం ఈశాన్య వీధిగా చెప్పుకోవచ్చు. అయితే ఈ ఈశాన్య వీధి వాయవ్యం నుంచి ఆగ్నేయ దిక్కుగా వెళ్తున్నట్లు ఉంటుంది. ఇలాంటి పరిస్థితుల్లో గృహమునకు ఈశాన్యము కోల్పోవడము జరుగుతుంది. ఇలానే కాకుండా గృహము యందలి ఈశాన్య భాగమును మింగిన వీధిగా కూడా చెప్పుకోవచ్చును. ఈ గృహము వారికి కీర్తి ఉన్ననూ అభివృద్ధి శూన్యంగా చెప్పుకోవాలి. గొడవలు ఎక్కువుగా ఉండవచ్చును. ప్రాణ భయం అధికంగా ఉండవచ్చును. ఇటువంటి స్థలాలలో గృహ నిర్మాణం చాలా కష్టము. గుడ్డిలో మెల్లగా ఈ ఈశాన్య వీధి బాగా వైశాల్యమును కలిగి ఉంటే గృహస్థులకు కాస్త ఊరటగా ఉంటుంది. ఇప్పుడు మనం వైశాల్యం ఎక్కువగా కలిగిన ఈశాన్య వీధిని చూద్దాము.

ఈశాన్య వీధిని చూద్దాము.




ముందు గృహమునకు ఈ పై చూస్తున్న గృహమునకు తేడా స్పష్టంగా తెలుస్తున్నది. రెండు గృహములకు ఈశాన్య వీధే. కానీ వైశాల్యములలో తేడా కలదు. ఇలా ఉన్నచో గృహస్థులకు కాస్త ఊరటగా ఉండగలదు.

ఈ ఈశాన్య వీధి పల్లమైనచో గృహస్థులకు మంచిది. అలా కాక మెరక అయినచో గృహస్థుడు కొన్ని రకాల ఇబ్బందులను ఎదుర్కోవలసి ఉంటుంది. ఉదాహరణకు అవమానం, రోగాలు, కొన్నిసార్లు అప్పుల బాధలు ఇతరత్రా. ఇప్పటి వరకు ఈశాన్య వీధి గురించి తెలుసుకున్నారు. ఇప్పుడు ఇలా కాకుండా విదిక్కులలో గల ఈశాన్య వీధి గురించి తెలుసుకుందాము.

స్థలము 90 డిగ్రీలకు అనుకూలంగా ఉన్నప్పుడు దిక్కులకు అనుగుణంగా గృహ నిర్మాణం చేసుకోవచ్చు. అలా కాకుండా స్థలము 90 డిగ్రీలకు సరిగా లేకుండా ఉన్నట్లు అయితే గృహము విదిక్కులో నిర్మించిన గృహముగా చెప్పుకోవాలి. ఇటువంటి గృహములలో ఫలితములు కాస్త వ్యతిరేకంగా ఉండే అవకాశం ఎక్కువ.



ఈ పై పటమును శ్రద్ధగా గమనించాలి. పై గృహమునకు వీధి తూర్పు వీధి కాదు. ఈశాన్య వీధి. ఇప్పుడు గమనించారు కదా! ఇవి ఎలా ఏర్పడుతాయి. ఓ పెద్ద స్థలములో వీధులు వేయునప్పుడు జాగ్రత్తలు తీసుకోకపోతే ఇలాంటి పరిస్థితులే ఏర్పడుతాయి. తూర్పు ఉండాల్సిన భాగంలో ఈశాన్యం ఉంటుంది. తూర్పు స్థానము ఆగ్నేయ భాగములోకి జరిగి ఉంటుంది. సరైన పద్ధతులను పాటిస్తే ఇటువంటి గృహములలో మంచి ఫలితాలను సాధించవచ్చు. ఇటువంటి ఈశాన్య వీధే ఇంకో విధంగా కూడా ఉంటుంది. ఈ గృహమునకు ఉత్తర ద్వారం పనికి రాదు. ఉత్తరము అనుకున్నది ఉత్తరం కాదు. అది వాయవ్యము. ఉత్తరం ఈశాన్య భాగమునకు జరిగి ఉంటుంది. ఇటువంటి స్థలాల చర్చ కాస్త తికమకగా ఉంటుంది.




అప్పుడే ఈశాన్య వీధి ఉత్తర వీధి ప్రాంతములో ఉండడమును గమనించారే. ఈ పై గృహములో ఈశాన్య ప్రాంతములో తూర్పు దిక్కు వచ్చి ఉంటుంది. ఈశాన్య దిక్కు ఉత్తరమునకు జరిగి ఉంటుంది. ఇటువంటి గృహములలో నిర్మాణము జాగ్రత్తగా చేసినట్లు అయితే గృహస్థులు సుఖపడే అవకాశం ఎక్కువ. పొరపాటు జరిగితే గృహస్థుడు అదోగతి పాలు కాక తప్పదు. ఇటువంటి గృహములలో సాధారణంగా తూర్పు దిక్కు అనుకొని ద్వారములు పెడుతూ ఉంటారు. అలా ద్వారములు ఏర్పాటు చేసుకోక పోవడం మంచిది. అది తూర్పు దిక్కు కాదు, అది ఆగ్నేయ దిక్కు అయి ఉంటుంది. కారణం తూర్పు దిక్కు శాన్యమునకు జరగడం వల్ల సంభవించిన పరిణామం ఇది. మనస్సు పెట్టి కాస్త నిదానంగా చదివితే విషయం చక్కగా అర్థమవుతుంది.

ఇక్కడే విధి తన శక్తిని చూపుతుంది. శాస్త్రలో కాస్త విధి యొక్క శక్తిని తగ్గించుకోవాలి. తూర్పు ద్వారము లేనట్లు అయితే మన ప్రయత్నం కాస్త ఫలించినట్లే. విధి రాత ఇంతేనని జ్వరం వచ్చినా డాక్టర్ దగ్గరకు వెళ్లకుండా ఉండలేము కదా. మన ప్రయత్నం మనదే.

**2. ఆగ్నేయ వీధి :-**



పై పటములో ఉన్న వీధి ఆగ్నేయ వీధి. వీధికి తగిన విధంగానే నిర్మాణం చేసుకోవలసి ఉంటుంది. అలా కాకుండా గృహమును 90 డిగ్రీలకు అనుకూలంగా నిర్మించినచో ఎంత అందగత్తైకైననూ మెల్ల కన్ను ఉంటే అందమంతా అడవి కాచిన వెన్నెల అయినట్లుగా వీధి ఒక ముఖము, గృహము ఒక ముఖము ఉండడము సరి కాదు.

వీధికి సమముగానే గృహ నిర్మాణములను కావించాలి. వ్యతిరేక దిశలో గృహ నిర్మాణం కావించడం సబబు కాదు. తూర్పు, దక్షిణ, పశ్చిమ మరియు ఉత్తర వీధుల గృహస్థులకు చిన్నపాటి సవరణలు చేసుకున్నచో ఫలితాలు బాగుంటాయి. అదే ఈశాన్య, ఆగ్నేయ, నైరుతి మరియు వాయవ్యం వీధుల గృహాలకు అతి సూక్ష్మ విధానమును పాటించవలసి వుంటుంది. ఏ చిన్న పొరపాటు జరిగినా భారీ మూల్యం చెల్లించక తప్పదు. ఏది ఏమైననూ ఈశాన్య, ఆగ్నేయ, నైరుతి మరియు వాయవ్యం వీధుల గృహాలు కొన్ని సమస్యలు ఎదుర్కోక తప్పదని నా భావన. ఇప్పుడు ఆగ్నేయ వీధి గృహము విదిక్కులో ఉన్నప్పుడు ఎలా ఉంటుందో చూద్దాము.




పై గృహములోని వీధి ఆగ్నేయ వీధి. అనగా తూర్పు ఉండవలసిన ప్రాంతంలో ఆగ్నేయం వచ్చి ఉంటుంది. అనగా ఇది విదిక్కు స్థలమని అర్థము. ఇటువంటి స్థలములలో నిర్మాణములు అత్యంత, అతి సూక్ష్మమైన విధానములను పాటించి నిర్మించుకోవాలి. లేకపోతే తిప్పలు తప్పవు. ఒక చిన్న పొరపాటుకు కూడా భారీ మూల్యమును చెల్లించక తప్పదు. ఇటువంటి గృహములలో అశాంతి ఎక్కువగా ఉంటుంది. అది ఏ విషయమైనా కానీ అశాంతి ఎక్కువ. అప్పులు కావచ్చు, గొడవలు కావచ్చు, చర్మ వ్యాధులు, మానసిక ఆందోళనలు అవి ఏవైనా కానీ అశాంతి ఎక్కువ. ఇటువంటి గృహములలో సవరణలు కూడా అత్యంత జాగరూకతతో చేయవలసి వుంటుంది. నిజం చెప్పాలంటే గొప్ప వాస్తు శాస్త్రవేత్తలు కూడా ఇటువంటి గృహాల విషయంలో అతి జాగ్రత్తలు తీసుకుంటూ వుంటారు. చూసే వారికి వీరి చేష్టలు విచిత్రంగా అనిపించవచ్చు. కానీ స్థలం అటువంటిది.



పై గృహమునకు కూడా ఉన్న వీధి ఆగ్నేయ వీధే. కానీ చూడటానికి దక్షిణ వీధిలా కనిపిస్తుంది. కారణం ఏమంటే విదిక్కు. దక్షిణ దిక్కు నైరుతికి జరిగి ఉంటుంది, ఆగ్నేయం దక్షిణానికి జరిగి ఉంటుంది. ఇటువంటి గృహాలలో కొందరు సాధారణంగా దక్షిణ ద్వారము లేదా పశ్చిమ ద్వారమును ఏర్పాటు చేసుకోవచ్చు. అవి ఏవీ పనికి రావు. ఉత్తరంలో ద్వారము ఉండడము మంచిది అని తలచి ఉత్తర భాగములో తలుపు ఉంచుకుంటారు. అది ఉత్తర భాగం కాదు. వాయవ్యంగా రూపాంతరం చెంది ఉంటుంది. స్వంత నిర్ణయాలు తీసుకోవద్దు. అనుభవజ్ఞుల సలహా మేరకు నడుచు కోవడం చాలా మంచిది.

**3. నైరుతి వీధి :-**




పై వీధి నైరుతి వీధి. వీధికి తగిన విధంగానే గృహ నిర్మాణం కావించాలి. మీరే ఆలోచన చేయండి. ఈ స్థలములో ఎలా నిర్మాణము కావించాలి. ఎంత కష్టమో యోచించారా! అసలే అనారోగ్యాలతో బాధపడుతున్న కుటుంబ సభ్యులు. ఇంట్లో ఎలుకలు చచ్చాయి. వారి పరిస్థితి ఎలా ఉంటుందో కదా! పై గృహము కూడా అలాంటిదే. ఎప్పుడూ అనారోగ్యాలతో బాధ పడవలసి ఉంటుంది. ఆర్థిక నష్టాలు, రోగాలు, మానసిక దుర్భరం, భద్రత లేని ఆలోచనలు, భయం ఇటువంటివి ఏర్పడవచ్చును.

విదిక్కులలో ఇదే గృహమును గమనిద్దాము.




దక్షిణము నైరుతిలోకి జరిగినప్పుడు నైరుతి పశ్చిమ దిక్కుగా జరిగినప్పుడు ఇటువంటి వీధులు ఏర్పడుతాయి. అనగా విదిక్కులలో ఇటువంటి గృహాలు ఉంటాయి. ఇలాంటి స్థల నిర్మాణ విషయంలో కూడా అత్యంత జాగ్రత్తలు తీసుకోవలసి ఉంటుంది. లేకపోతే కైలాసప్రాప్తి.




విదిక్కు స్థలములలో ఇటువంటి గృహాలను గమనించవచ్చు. ఇక్కడ దక్షిణము ఆగ్నేయ దిక్కుగా జరిగి ఉంటుంది. నైరుతి దక్షిణ దిక్కుగా జరిగినప్పుడు ఇటువంటి నైరుతి వీధి ఏర్పడుతుంది. నిర్మాణము బహు జాగ్రత్తగా చేయాలి. లేనిచో గృహస్థులు ముప్పు తిప్పులు పడక తప్పదు.

**4. వాయవ్య వీధి :-**




పై గృహమునకు వాయవ్య వీధి కలదు. అప్పులు, తిప్పలు, కొట్లాటలు, ఆస్థి గొడవలు, తకరార్లు, వ్యవహారములు, కోర్టులు, కచేరీలు, పంచాయితీలు, పాడు పరదేశి. ఇంకా ఎన్నో ఎన్నెన్నో.




ఇక్కడ ఉత్తరము వాయవ్య దిక్కుగా జరిగి, వాయవ్యం పశ్చిమ దిక్కుగా జరిగినప్పుడు ఇటువంటి స్థలాలు ఏర్పడును. అనగా విదిక్కు స్థలమే. జాగ్రత్తలు తీసుకోకపోతే నిండా మునగాల్సి ఉంటుంది.




విదిక్కుల్లో ఇలాంటి పై స్థలాలు ఉంటాయి. ఇక్కడ ఉత్తరము ఈశాన్య దిక్కుకు జరిగి వాయవ్యం ఉత్తర దిక్కు ప్రాంతంలో ఉంటుంది. అనగా విదిక్కే, జాగ్రత్తలు తప్పదు.

ఇటువంటి గృహాలే కాక ఇంకాకొన్ని అతి సూక్ష్మమైన విషయం గల గృహాలను కూడా చూడవచ్చును. ఉదాహరణకు ఈశాన్య వీధి గృహమును తీసుకుందాము. ఈ ఈశాన్య వీధి గృహమును రెండు విధాలుగా చెప్పుకోవచ్చును. 1. తూర్పు ఈశాన్య వీధి గృహముగానూ మరియు 2. ఉత్తర ఈశాన్య వీధి గృహముగానూ చెప్పుకోవచ్చును. (వాస్తు సర్వస్వము అను పుస్తకమును వ్రాయడం జరుగుతున్నది. దాదాపుగా 1200 పేజీల పై మేరకు పుస్తకం విడుదల చేయాలని సంకల్పించాము. ఇందులో అతి సూక్ష్మమైన విషయాలను కూడా తెలుసుకుందాము.)

ఫలితాలు చాలా తక్కువగా మార్పులు చెందును. కానీ గృహములో కాస్త తేడా అనిపిస్తుంది. గృహ ప్లాను చూడగానే కాస్త తేడా కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. ఇప్పుడు ఉదాహరణగా ఈశాన్య వీధి గృహములో తూర్పు ఈశాన్యం తిరిగిన వీధి గృహమును చూద్దాము.




పై గృహము ఉత్తర ఈశాన్య దిక్కుగా తిరిగినట్లు తెలుస్తున్నది. ఈశాన్యములో రెండు భాగములని తెలుసు. 1. ఉత్తర ఈశాన్యం, 2. తూర్పు ఈశాన్యం. ఈ పై వీధి ఉత్తర ఈశాన్య వీధిగా అనుకుందాము. ఈ క్రింది పటమును చూడండి.




ఈ పై వీధి తూర్పు ఈశాన్య దిక్కుగా ఉండడాన్ని చూడవచ్చును. ఇదేదో గొప్ప విషయంగా, పరిశోధనగా అనుకోకపోతే ఇందులో ఎన్నో సూక్ష్మ రహస్యాలు దాగి ఉంటాయి. ఉదాహరణకు నైరుతి వీధిలో ఈ చిన్నపాటి మార్పులు గృహ ఫలితాలలో తేడా కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. ఇక్కడ అంతగా అనిపించక పోవచ్చును.

ఇప్పటి వరకు మూలలకు తిరిగిన వీధుల గురించి చూశాము. ఇప్పుడు మూలలు సరిగా ఉండు వీధుల గురించి తెలుసుకుందాము.

**మూలలు సరిగా ఉండు వీధులు :-**

పరిసర వాస్తులో ఒక భాగము వీధులు. మనం ఇంతకు ముందు అనుకున్నట్లుగా పరిసర వాస్తులో వీధులు, వీధిపోట్లు, కొండగుట్టలు, సరస్సులు, నదులు, చెట్లు తదితరములైన విషయాలు వస్తాయి. ముందుగా మనము వీధులు గురించి తెలుసుకుందాము.

వీధులు అనగానే మన గృహము దాటి ఉన్న విషయము అనునది మీకు స్పష్టముగా తెలుస్తున్నది. మన గృహము దాటిన తర్వాత అనగా మన గృహము బయట అనగానే మనం వెంటనే పరిసర వాస్తు విషయము అని మననం చేసుకోవాలి. మన గృహము దాటిన తర్వాత ఏ నిర్మాణమునైనా సరే లేదా ప్రకృతి విషయములను అయినా సరే మాట్లాడుకునేటట్లు అయితే అది పరిసర వాస్తు గురించి తెలుసుకుంటున్నాము అని అనుకోవాలి.

వీధులు గృహము లోపల రావు. గృహము దాటే ఉంటాయి. అనగా పరిసర వాస్తు అని అర్థము. మన గృహము బయట వాడుకలో ఉన్న నడక, రోడ్డును, వీధి అంటాము. ఈ వీధులు కూడా మన గృహముపై ప్రభావమును చూపిస్తాయి. ఉదాహరణకు మనది తూర్పు వీధి గృహము అనుకుందాము. అనగా మన గృహమునకు తూర్పు భాగమున రోడ్డు దక్షిణము నుండి ఉత్తరానికి సాగుతుంటుంది. ఈ రోడ్డే దక్షిణ భాగములో పల్లముగా ఉండి ఉత్తరమునకు సాగే కొద్దీ మిట్రు లేదా ఎత్తు అయినచో ఆ రోడ్డు ఫలితములు మనకు అందక పైగా అశుభ ఫలితములను మన గృహమునకు ఇస్తాయి.

ఒకవేళ వీధి దక్షిణమునందు మిట్రు, ఎత్తుగా ఉండి ఉత్తరమునకు పోవు కొద్దీ పల్లమైనచో ఆ శుభఫలితములు మన గృహమునకు అందుతాయి. తద్వారా ధనవృద్ధి ఇతరత్రా అనుకూలమైన పరిణామములు ఉండును.

వీదులు వేరు వీధి పోట్లు వేరు.

శుభకరమైన వీధి చూపులతో అద్భుతమైన జీవనం లభిస్తుంది. అశుభ కరమైన వీధిపోట్లతో జీవితం

భ్రష్టుపడుతుంది. శుభము కానీ అశుభము కానీయండి వీధిపోట్ల ప్రభావము గృహముపై చాలా ఎక్కువగా ఉంటుంది. అదే వీధులైతే శుభాశుభముల ప్రభావము అంత ఎక్కువగా ఉండదు. కానీ చిన్న పాటి ప్రభావము గృహముపై కనబరుస్తుంది.

వీధిపోట్లు వాస్తు శాస్త్రంలో అత్యంత బలమైన విషయంగా చెప్పుకోవచ్చు. అయితే **"వీధులు"** మాత్రం **"వీధిపోట్లు"** అంత శక్తిని కలిగి ఉండవు. ఒక్కోసారి ఇవే వీధులు మంచి శక్తిని కూడా కలిగి ఉంటాయి. ఉదాహరణకు ఒక గృహమునకు తూర్పు వైపున రోడ్డు మరియు పశ్చిమ వైపున రోడ్డు ఉంది అనుకుందాము.




ఇలా పై చూపిన విధంగా ఒక గృహమునకు తూర్పు వీధి మరియు పశ్చిమ వీధి ఉన్నట్లు అయితే తూర్పు వీధి పల్లముగానూ, మరియు పశ్చిమ వీధి బాగా మెరకగానూ ఉన్నట్లు అయితే అప్పుడు ఆ వీధులకు మంచి శక్తి కలిగి ఉన్న వీధులుగా చెప్పుకోవచ్చును. గృహముపై ఈ వీధులు మంచి ప్రభావమును చూపించగలవు. తూర్పు వీధి పల్లమై గృహస్థుల అభివృద్ధిని, కీర్తిని, ఐశ్వర్యమును, ఇతరత్రా కాంక్షించును. పశ్చిమ వీధి మెరకై గృహస్థుల భద్రతను, ఆదిపత్యమును, ఆరోగ్యములను చూసుకొని కాపాడును.

**మీ గృహము వాస్తురీత్యా ఉన్నచో బయటవీధి శుభము కానీ, అశుభము కానీ ప్రభావము కొద్దిగా ఉంటుంది. అదే మీ గృహము వాస్తురీత్యా నిర్మించు కోకపోయి నట్లయితే బయట వీధి చెడుగా ఉంటే దాని ప్రభావం కాస్త ఎక్కువగా ఉంటుంది.**

పరిసర వాస్తు ప్రభావము సరిగా లేనప్పుడు దాన్ని ఎదుర్కోవాలంటే మన గృహములో తప్పనిసరిగా వాస్తు పట్టును పెంచి సక్రమంగా ఉండవలసినవన్నీ ఉంచుకున్నట్లు అయితే అనగా వాస్తు రీత్యా నిర్మాణము సరిగా ఉన్నట్లు అయితే పరిసర వాస్తు యొక్క దుష్పరిణామము నుంచి కాపాడుకునే అవకాశము చాలా ఎక్కువగా ఉంటుంది.

అసలే కుంటి ఆపై గుడ్డి వీపున నీటిబిందె ఇలా ఉంటే అతని పరిస్థితి ఏమిటి, అతను ముందుకు ఎలా వెళ్లగలడు. వెళ్లినా తాబేలు నడకలా ఉంటుంది. అలాగే పరిసర వాస్తు ప్రభావము గృహముపై ఎక్కువగా ఉన్నప్పుడు గృహములో నిర్మాణము వాస్తు రీత్యా లేనప్పుడు గృహస్థుల అభివృద్ధి కూడా కుంటి వారిలాగే ఉంటుంది. ఎంత కష్టపడినా తగిన రీతిలో ప్రతిఫలము దక్కదు.

గృహ నిర్మాణమును వాస్తు రీత్యా నిర్మించుకున్నట్లు అయితే పరిసర వాస్తు ప్రభావమును కాస్త తగ్గించుకోవచ్చును. ఉదాహరణకు వీధులు గురించి తీసుకుందాము. ఒక గృహము వాస్తు రీత్యా నిర్మించారు.

అటువంటి గృహమునకు తూర్పు వీధి బాగా మెరకై పశ్చిమ వీధి పల్లముగా ఉంటే వీటి ప్రభావము గృహముపై పడిననూ అనుకున్నంత మేరకు దెబ్బతీసే అవకాశము తక్కువగా ఉంటుంది.

గృహ నిర్మాణము **అవాస్తు** రీత్యా ఉన్నట్లు అయితే పై చెప్పుకున్నట్లు తూర్పు వీధి మెరకై పశ్చిమ వీధి పల్లమైనట్లు అయితే అగ్నికి గాలి తోడైనట్లుగా అసలే మూలిగే నక్క నెత్తిపై కొబ్బరి బోండాం పడినట్లుగా ఉంటుంది. అసలే గృహములో వాస్తు లేదు. పైగా గృహము బయటగల వీధులు పరిసర వాస్తు రీత్యా ఈ గృహమును దెబ్బతీస్తున్నాయి.

పై రెండు పేరాలను గమనించారా! కాస్త తేడా కానీ ఫలితాలు మాత్రం చాలా ఎక్కువ తేడాగా ఉంటాయి.

అందుకే కొందరికి కొన్ని విషయాలలో ఎక్కువుగా అనుమానాలు వస్తుంటాయి. ఈ గృహములో అలా జరుగుతోంది, ఆ గృహములో ఇలా జరుగుతోంది అని అనుకుంటారే కానీ పరిసర వాస్తును కూడా ఇక్కడ గమనించాలి. పరిసర వాస్తును చూడక గృహము యందలి వాస్తును మాత్రం గమనించి ఫలితాలను ఎక్కువగా ఊహించడం మంచిది కాదు.




పై చిత్రమును చూడండి. 2వ గృహమునకు నైరుతి భాగంలో కొండ గలదు. ఈ గృహముపై కొండ ప్రభావము ఎక్కువుగా ఉంటుంది. 1వ గృహమునకు కొండ ప్రభావము ఉందా?

ఈ పై రెండు గృహాలు ఖచ్చితమైన వాస్తు పాటించి, ఖచ్చితమైన కొలతలను, చివరకు పెయింట్ కూడా ఒక్కటే వేశారు. ఇది ఇలా ఉండగా రెండవ గృహం వారికి బాగా జరగడం, 1వ గృహం వారికి 2వ గృహం అంత బాగా జరగడం లేదు. కొందరు ఒక ప్రశ్నను నాకు వేశారు. ఒక్కటే విధమైన గృహాలు కానీ ఫలితాలలో మాత్రం తేడా ఉన్నది. మరి వాస్తు ఇక్కడ పని చేయడం లేదు ఎందుకు? అని అడిగారు. నైరుతి భాగములో ఉన్న కొండను గురించి ఏ మాత్రం యోచన చేయలేదు. నైరుతిలో గల కొండ ప్రభావమే పరిసర వాస్తు ప్రభావము. ఈ కొండ 2వ గృహముపై విపరీతమైన ప్రభావము చూపిస్తుంది.

అందుకే కొందరు ఫోన్లు చేసి తమ ఇంటి నిర్మాణములను చెప్పి ఫలితాలు ఎలా ఉంటాయని అడిగినప్పుడు కొందరు శాస్త్రవేత్తలు సరిగా సమాధానం చెప్పరు. కారణం ఇదే. చాలా మంది పరిసర వాస్తును దృష్టిలో ఉంచుకోరు. ఏదో ప్రశ్న వేయాలి కదా అని ప్రశ్నిస్తారు. అంతేకానీ పరిసర వాస్తు ప్రభావమును గురించి వారు ఊహించరు. మరియు ఆ విషయమును ప్రస్తావించరు. అందుకే ఒక గృహము గురించి చెప్పవలనంటే మొత్తము చుట్టు ప్రక్కల ప్రదేశాలు కూడా గమనించాలి. అప్పుడు మాత్రమే ఫలితాలను చెప్పడానికి వీలు అవుతుంది.

కర్నాటక రాష్ట్రంలోని చిత్రదుర్గం జిల్లాలోని ఒక గ్రామంలో ఒకరి ఇంటికి వెళ్లడము జరిగినది. కొత్తగా ఒక గృహమును కొన్నాము అందులో ఇప్పటికి నలుగురు నాశనమయ్యారు. అయిననూ తక్కువ ధరకు వస్తుండడంతో ధైర్యం చేసి కొన్నాము, దయచేసి గమనిస్తురు రండి అని పిలుచుకువెళ్లారు. తీరా

అక్కడకు వెళ్లాక ఆ ఇంటిపై పరిసర వాస్తు ప్రభావము వికృతంగా ఉంది. అది గమనించని కొందరు వాస్తు శాస్త్రవేత్తలు గృహములో రక రకాలైన మార్పులను సూచించి ఎన్నో సవరణలను కావించారు. దాదాపుగా ఆ గృహములో గదికి 8 చొప్పున మంత్రించిన కొబ్బరి బోండాంలు గల మూటలను గదిలో పై భాగమున వేలాడుతూ ఉండడాన్ని గమనించడం జరిగినది. 8 గదుల గృహము అది. ఇక ఎన్ని కొబ్బరి బోండాంలు తగిలించారో ఆలోచించండి. కొబ్బరి బోండాంలకు ఒకటికి 1500/- రూపాయల ప్రకారము తీసుకున్నారట. ఇక మొత్తం లెక్క ఎంత అయ్యిందో మీరే చూడండి. అమాయకులు దొరికితే చాలు నిండా ముంచడానికి కొందరు సిద్ధంగా ఉంటారు. మోసపోయేందుకు వీరికి బుద్ధి ఉండాలి. అంతేకానీ ఎవరిని పడితే వారిని పిలుచుకువస్తే ఇంటిలో ఉన్న రూపాయి కూడా బయటకు వెళ్లి పోతుంది. ఆ గృహానికి ఉన్న దోషాలను గమనించండి.

1. తూర్పు వీధి బాగా మెరక (పరిసర వాస్తు ప్రభావము)
2. పశ్చిమ వీధి మూడు అడుగుల పల్లము (పరిసర వాస్తు)
3. ఉత్తర వాయవ్య వీధిపోటు (పరిసర వాస్తు ప్రభావము)
4. గృహములో చాలా కొద్దిగా ఉత్తర వాయవ్యము పెరిగింది (గృహ వాస్తు ప్రభాము)

ఈ గృహములో ఉన్న దోషాలు ఇవి. వీటిని గమనించక అనేక రకాలైన సవరణలను గృహములో చేశారు. మీరు నమ్మండి లేదా నమ్మక పోండి. దాదాపుగా 30 సార్లు గృహములో సవరణలను చేశారంటే ఎంత ఆశ్చర్యంగా ఉందో చూడండి. అదే మొదటే ఒక అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్తను పిలిపించి ఉంటే ఈ దరిద్ర్యం పట్టేది కాదు కదా! మంత్రించిన బోండాంలకే సొమ్మంతయూ నాశనం అయ్యింది. వీరు పైగా పొగొట్టుకున్నదే ముంటుంది. 64 బోండాంలలో ఒక్కటి నెత్తిన పడినా చాలు కదా చావడానికి.

ఈ గృహముపై పరిసర వాస్తు ప్రభావములు మూడు కలవు. గృహము యందలి వాస్తు ప్రభావము ఒక్కటే.

మూడు పరిసర వాస్తు యొక్క చెడు ప్రభావములు కలిసి గృహమును అత:పాతాళానికి చేర్చినవి.

ఈ బయట దోషాల గురించి మీకు ఎవరైనా చెప్పారా అని అడిగిన ప్రశ్నకు బయట దోషాలు అంటే ఏమిటి సార్ అని అడిగారు. ఇక దీనిని బట్టే అర్థము చేసుకోవచ్చును, పరిసర వాస్తును ఎవరూ కూడా దృష్టిలో ఉంచుకోలేదని.

చెడు పరిసర వాస్తు బలమును త్రుంచి వేయాలి. శుభ పరిసర వాస్తు ప్రభావమును ఇంటిలోనికి ఆహ్వానించాలి. ఇది ఎవరు చేయగలరు. ఒక అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్త తప్పకుండా చెడు పరిసర వాస్తు బలమును త్రుంచి, శుభ పరిసర వాస్తు ప్రభావమును గృహముకు అందేలా చేయగలడు.

వీధులకు ఏ మాత్రం బలం లేదనుకోకూడదు. ఒక చీమ ఏం చేస్తుందిలే అనుకుంటే ఎలా. అది కుట్టరాని ప్రదేశంలో కుడితే అప్పుడు దాని బలమేమిటో తెలుస్తుంది. అలాగే వీధి కూడా. ప్రతి ఒక వీధి ఒక్కటే బలాన్ని కలిగి ఉంటుంది అని అనుకోరాదు. కొన్ని వీధులకు బలం అధికంగా ఉంటుంది. ఇంకొన్ని వీధులకు బలం తక్కువగా ఉంటుంది. వీటన్నింటిని దృష్టిలో ఉంచుకొని గృహ నిర్మాణమును కావించాలి మరియూ ముందే నిర్మించిన గృహములో సవరణలను కావించాలి.

పరిసర వాస్తును దృష్టిలో ఉంచుకోక గృహములో సవరణలు కావించడం మంచి పద్ధతి కాదేమో. ముందుగా పరిసర వాస్తు ప్రభావమును కూడా దృష్టిలో ఉంచుకోవాలి.

ఇంకొందరు ఎలా ఉంటారంటే ఒకటి రెండు వాస్తు విషయాలు తెలియంగానే తమకు అన్నీ తెలిసినవి అని తామే కొన్ని సవరణలు కావించుకొని దెబ్బమీద దెబ్బ పడి మూలుగుతూ ఉంటారు.

ఒక పుస్తకాన్ని తయారు చేయడమంటే ఎంత కష్టమో కేవలం రచయితకు మాత్రమే తెలుస్తుంది. లేదా రచన విలువ తెలిసిన పాఠకులకు తెలుస్తుంది. ఇతరులు దీని విలువ మరియు ప్రాముఖ్యత తెలుసుకోలేరు. సాధారణంగా పాఠకులు చక్కని విజ్ఞతను కలిగి ఉంటారు. అందుకే రచయిత యొక్క ఇతర రచనల కోసం ఆతృతగా ఎదురు చూస్తుంటారు.

2004వ సంవత్సరంలో శుభవాస్తు పుస్తకం వచ్చినప్పుడు ఒక గొప్ప వాస్తు సిద్ధాంతి నాకు ఫోన్ చేసి ఇంత చెత్త పుస్తకాన్ని ఎందుకు వ్రాశావు! నా జీవితంలో ఇంతటి ఘోరమైన పుస్తకాన్ని నేను ఎప్పుడూ చూడలేదు అని అన్నారు. తరువాత సంవత్సరంలో నాకు ఫోన్ చేసి మిగిలిన పుస్తకాలు ఎప్పుడు వస్తాయని ఎంతో గౌరవంగా మాట్లాడారు. ఆశ్చర్యపోవడం నా వంతు అయింది. నేను అడిగిన ప్రశ్నకు సమాధానంగా మాకు వయస్సు ఎక్కువ, నీకు వయస్సు తక్కువ, కానీ అపారమైన అనుభవాన్ని సంపాదించుకున్నావు అని అన్నారు. ఒక శాస్త్రమును రచించు సమయమున ఎన్నో సాధారణ విషయాలను పరిగణనలోకి తీసుకోవలసి వస్తుంది. అన్నీ విషయాలను క్రోడీకరించి పాఠకుల అమృత హృదయాలను తాకునట్లుగా రచన ఉండాలని నా అభిప్రాయము. అందుకే నేను వ్రాసిన పుస్తకాలను అడిగి మరీ కొనడం జరుగుతున్నది. ఇతర రచనలు ఎప్పుడు వస్తాయని అడిగే పాఠకుల సంఖ్య చాలా అధికమైనది. ఒక రచయితగా ప్రజలు ప్రేమగా ఇస్తున్న ఈ బహుమతులు జీవితంలో సరిపోవా! మీ అభిమాన వాత్సల్యము మరియు ఆశీర్వాదము వల్లనే నేడు మన www.SubhaVaastu.com వెబ్‌సైట్ ప్రపంచంలోనే అత్యంత పెద్దదిగా గుర్తింపు పొందినది. దినమునకు 25 వేల మందిపైన వెబ్‌సైట్‌ను చూడడానికి వస్తున్నారంటే అది కేవలం మీ సహకారము వల్ల మాత్రమే సాధ్యమైనది.

దాదాపుగా 10 సంవత్సరాలుగా ప్రతి e-books ను ప్రజలందరికీ ఉచితంగా అందజేయడం జరిగింది. అయితే నేడు ఒక మాసమునకు దాదాపుగా ఈ వెబ్‌సైట్ యొక్క ఖర్చు 50,000/- రూపాయలు దాటి పోతున్నది. అందువల్ల ఉచితంగా పుస్తకాలను ఇవ్వలేకపోతున్నాము. ఈ పుస్తకము నందలి మిగతా భాగమును చదవలెనన్న మీరు ఈ లింక్ యందలి బ్యాంక్ నందు 14 యు.ఎస్. డాలర్లను కట్టవలసిందిగా తెలుపుటకు బాధగా ఉన్ననూ తప్పడం లేదు. మన రూపాయలలో 500 రూపాయలను బ్యాంక్ నందు జమ చేయగలరు. బ్యాంక్ లింక్ :- http://www.subhavaastu.com/vastu-payments.html

ఎన్నో లక్షలు పోసి www.SubhaVaastu.com ను తయారు చేసిన విషయము మీకు తెలిసినదే. డెస్కటాప్ వాల్‌పేపర్స్ దాదాపుగా 21,650 దాటి పోవడం మీకు తెలుసా. ఈ లింక్ ద్వారా వాల్‌పేపర్స్‌ను డౌన్‌లోడ్ చేసుకోవచ్చును. http://www.subhavaastu.com/wallpapers-section.html

ఇతర వాస్తు పుస్తకాల కొరకు ఈ లింక్‌ను క్లిక్ చేయండి. http://www.subhavaastu.com/free-vastu-ebook-downloads.html

our e-mail is : subhavaastu@gmail.com

త్వరలో భారతదేశంలోని అన్ని బాషల్లోనూ మన వెబ్‌సైట్ విడుదల కాబోతున్నది.

రచయిత
- సురేష్
సెల్ :- 098481 14778.